"అది మీ తోటేనా ?" అన్నాను.

"తోట చూస్తారా ! రండి" అని-

నన్ను సంతోషంతో వెంటబెట్టుకుని ముందు నడిచింది. నడుస్తో వుంటే ఆ పిరుదులు కదలడం, ఆ పక్కవొంపుల నున్నదనం, యేం చెయ్యను ? యింతకాలం యెక్కడ బతికాను నేను ? అనిపించింది.

"గండుచీమలు, ఇట్లారండి."

చప్పున నన్ను పక్కకి లాగింది. కావలిసేనా?

యిద్దరం దట్టమైన మందారమొక్కవెనక నుంచున్నాము. రెండు పువ్వులుకోసి తలలో పెట్టుకుంది. తలలో వేళ్ళు పెట్టుకోడానికి చేతులెత్తితే సాగిన ఆ కండరాల వుబుకు, ఆ గట్టితనం ! ఇంక అన్ని అనుమానాలూ, భయాలూ యెగిరిపోయినాయి ఆమెచేతులు వొంచగానే రెండుచేతులతో ఆమె రెండుజబ్బలూ గట్టిగా పట్టుకున్నాను. వాటి గట్టిమాంసం నావేళ్ళకి ఎదురుతిరిగింది. యెంతగట్టిగా వొత్తినా వెచ్చగా, నున్నగా, గట్టిగా.... నువ్వెప్పుడన్నా అనుభవించావో లేదో ఆ సౌఖ్యం ! యీ పొయ్యికాడి భార్యలందరూ చేతుల్లో యెక్కడో అణిగి, వొంగి నలిగిపోతారు. గాడమైన మోహంతో గట్టిగా కావిలించుకోగానే, "ఉస్, కస్, అబ్బా నొప్పి, అబ్బా అక్కడవొద్దు, అబ్బా వొదలండి" అని-

వొదలగానే వెధవ వెకిలి నవ్వుతో చచ్చుసిగ్గు ప్రయత్నించి కుళ్ళు మాటలతో "మరేని ? పూరిఖే ! ఏమిటా మోటసరసం ! అబ్బా, ఎహ" అంటే

నీ ప్రాణమెట్లా వుంటుందో ఆలోచించుకో. గట్టిగా, గర్వంగా, బలంగా, చేవగా-

యేం చెప్పను ! ఎంతచెపితే అర్థమౌతుంది ? ఆ ఐదునిమిషాలు ఎట్లా వున్నానో ! ఏమైనానో ! ఆమె వొదిలించుకోవాలని పెనుగులాడిన కొద్దీ, నేనాక్రమించుకున్నాను. చేతులు జారిపోతున్నాయి. నా బలం యెందుకూ కొరగాకుండా పోతోంది. ఆమె వొంటినుంచి సహజమైన, నైసర్గికమైన వాసన నా తల తిప్పేసింది. ఆ నిమిషాలకుబదులు నిరంతర జీవనం, దేవత్వం

యిచ్చినా నాకు వొద్దు. మనం కొని భద్రంగావాడే ఆ సాహేబుల బుడ్లలోని ఆ కుళ్ళు అత్తరునూనె లెందుకు ? భద్రంగా ఆకులో చుట్టి పొడుంపొట్లంతోపాటు జేబులో పడేసుకుని, బజారునించి అరగంట బేరంచేసి,అర్ధణాకు కొని తెచ్చుకునే చెన్నపట్నపు రైలుకంపు దవనం వాసన యెందుకు ? గజకుంభాల్లోని మదపువాసనా, బలిసి శుభ్రమైన ఆవుల్నించి వొచ్చే వుత్తమ గోరోజన పరిమళమూ, వాన కురిసినప్పుడు పచ్చని గడ్డిలోంచి పన్నీరు పువ్వులోంచి కొత్తగా తవ్విన మట్టి పెళ్ళల్లోంచి వొచ్చే సౌరభం, కస్తూరిమృగపు అద్వితీయగంధం, అన్నీ తలపుకు వొచ్చాయి నాకు, ఆమె సన్నిహితంలో. ఆమె నన్ను తోసేసి తప్పించుకుని, కోపం తెచ్చుకుని-

"నన్ను తాకకండి" అని నుంచుంది. నా మొహంలో ఆశ్చర్యాన్నీ నిరాశనీ చూసిందేమో ! ఒక్క అడుగు వెనక్కివేసి, అటుతిరిగి నవ్వుతో కొట్టుదగ్గిరికి పరుగెత్తింది. చిన్న ఆవు పెయ్యి పరుగును పోలిన ఆ అందమైన వేగాన్ని చూస్తో వెనకనే వెళ్ళాను. దగ్గిరగా రానిచ్చి నన్ను అనుకున్నట్టుగా వొంగి-

"నేను అట్లాంటి మనిషిని కానండీ"

అని గోముగా అంది. మళ్ళీ నవ్వింది విచిత్రంగా. నేను నుంచున్నాను. నా తల తిరుగుతోంది. కళ్ళు మూతలు పడుతున్నాయి. లోకంమీది నిర్లక్ష్యం ఎక్కువవుతోంది. ఆమెకళ్ళు నన్నుచూసి నవ్వుతున్నాయి. ఆ దేహమె పెద్ద నవ్వు-

"ఈ గదుల్లోనండి....రాత్రైతే సరి. యిద్దరిద్దరు (నవ్వుతో) పో .... లారు .... ఛీ ఛీ .... వీళ్ళకి సిగ్గు .... అభిమానం .... యేమీ లేవు."

నాకు ఒకటే ఆశ్చర్యంగా వుంది. యెవరీ వ్యక్తి ? ఇది అంతా కపటమా, అమాయకమా ?

"మీవంటివారు నన్నూ అట్లాంటిదాన్నే అనుకుంటారు. నేను యెన్నడూ ఎరగను. మర్యాదస్తులమండి. మీతో యిట్లా మాట్లాడగానే చులకనై నట్టున్నాను. అదుగో మళ్ళీ యేం ? చేతులూరుకోవూ ? ఎవరను కున్నావు? అక్కడే ఆగండి. చెపుతూవుంటే ! తెలీటంలా ?"

నా కళ్ళలో నిరాశో దిగులో ఏదో చూసిందిగావును ఆమెని వొదిలి ఏమి చెయ్యడానికి తోచక దూరంగా నుంచున్న నా వెర్రితనాన్ని చూసి దగ్గిరగా వొచ్చి తనకేం తెలీనట్లు ఎక్కడో చూస్తో తన గట్టి రొమ్ము పక్కగా నా భుజానికి తగిలిస్తో, నల్లని మెరిసేచేతిని నా తెల్లషర్టుమీద నించి అడ్డంగా జేబుదగ్గిరికి పోనిచ్చి మోకాలుతో నా కాలుని అదిమి-

"రాత్రికి బియ్యానికి ఏం లేదు. యామన్నాయిస్తే...." అంది. నా ప్రాణం చివుక్కుమని మొహం తిప్పేశాను.

ఆ స్వప్నమంతా ఆ వొక్కమాటతో మట్టిపాలయింది. ఎంత "రొమాన్సు" ఎంత సృష్టిసౌందర్యాన్ని, భావించుకున్నానో అంత నీచత్వమూ నా మనసుని విరిచింది. ఇంత సౌందర్యమూ, యిట్లాంటి పనుల్లో వుపయోగపడుతోందా-అనుకున్నానుగాని, ఆమె మోహం చూస్తేమాత్రం, మనుష్యులరక్తంపీల్చి కొవ్వెక్కి నగలలోను, మేడల్లోను, తృప్తిపడే పట్టణపు పిశాచుల రక్తమేనని విశ్వసించలేక పోయినాను. ఇంత నా మనసు చివుక్కుమన్నా ఆమెని వొదిలి వెళ్ళాలని బుద్ధిపుట్టడం లేదు. నిజంగానే రాత్రి భోజనానికి డబ్బు అవసరమేమో పాపం! అని అనుకుంటో వుండగానే, రోడ్డుమీదనుంచి ముసలామె వొచ్చి మా యిద్దర్నీ చూసింది.

"ఏమిటే చేస్తున్నానిక్కడ? ఈయనెవరు?"

ఇదేమిటి? తనని బలవంతం చేస్తున్నానని చెప్తుతుందా? నన్ను వెక్కిరించి నవ్వుతుందా? అక్కడికి యెందుకు వెళ్ళానా, అనుకొని భయపడుతున్నాను. పోట్లాటా, ఆమెభర్తా, గుంపూ మా అత్తవారిదాకా తెలీడం, మాదిగదాన్ని-నాకు వొణుకుపుట్టింది.

"ఏం లేదు. తోట చూస్తానన్నారు" అంది.

ముసలిది కోపంతో-

"మొగాళ్ళతో నీకేంపని? పద ముందు; తోటలు చూస్తాట్ట!"

అమ్మాయి సంశయిస్తో నుంచుంది.

"నడుస్తావా? మీ అయ్యతో చెప్పి పీపు చీల్పించనా?"

"కోప్పడకమ్మా ! ఈయన అట్లాంటి మనిషికాడు"

ఆ మాటతో ఏమనుకుందో, ఏ మర్థమయిందో, ఆ ముసిలిది తగ్గి నడవడం మొదలు పెట్టింది.

"పెద్ద మనుషులు, కనపట్టంలేదూ? అన్యాయంగా ఆగ్రహిస్తున్నావు" అంది మళ్ళీ.

"సరేలే. కాని యింటో బియ్యం లేవు. పోయి సంపాయించుకురా. పెద్దమనిషితో మాట్లాడుతుంటే కడుపు నిండుతుందా? పెద్దమనుషులు! అందరూ పెద్దమనుషులే!"

అనుకుంటో వెళ్ళింది.

"మా అమ్మ"

"నిజంగా మీకు తిండిలేదా? ఈ తోటా...."

"మక్తా. అంతా నష్టమేనండి ఈ యేడు...."

జేబులోంచి తీసి ఐదురూపాయలనోటు ఇచ్చాను.

"ఇట్లా లోపలికిరండి"

"నేను వెడతాను"

"ఇప్పుడు రారా? ఎప్పుడొస్తారు?"

"నేను రాను"

"ఏం?"

"ఎందుకు? నాకేం పనిలేదు"

"ఈవేళ పనివుండే వచ్చారా?"

నాకు కోపం హెచ్చుతోంది.

"నువ్విట్టాంటి దానివనుకోలేదు"

"ఎట్టాంటిదాన్ని ?"

"సొమ్ముకు గడ్డితినేదానివి"

పెదిమ కొరుక్కుని, కళ్ళు తళతళమంటో నాకేసి చూసి తల వొంచుకుంది....అంతా నిశ్శబ్దం.

"ఐతే సొమ్మెందుకిచ్చారు?" కంఠం వొణుకుతోంది!

"మీకు తిండిలేదుగా?"

మాట్లాడకుండా నుంచుంది. వొంచుకునివున్న కళ్ళల్లోంచి రెండు చుక్కలు పమిటయెత్తుమీదపడి చిందాయి. కోకిల వూరికే ఆత్రుతతో కూస్తోంది. నీళ్ళతో నిండిన గాలివీచింది. సూర్యుడి చివరకాంతి యెర్రగా ఆమె చేతులమీద పడుతోంది. ఆమెతల్లో పువ్వుచుట్టూ జుట్టు వుంగారాలు మూగాయి. మళ్ళీ ఆమె అందం, ఆమె మోహం, నన్నాకర్షిస్తున్నాయి. ఆ విచారాన్ని నేనాట్టేసేపు 'రెపిస్టు' చెయ్యలేను. అప్రయత్నంగా పెదవులు ఆమె కళ్ళను వోదారుస్తాయి. ఆమె హృదయాన్ని జయించానని ఆశ పడుతూ వుండగా, నన్ను దబ్బుడిగిందే, అనే అహంభావానికి కలిగిన గాయం నన్ను అమితంగా బాధపెడుతోంది. వెళ్ళేట్టు కదిలాను.

"సరే వెడుదురుగాని, ఒక్కసారి ఇట్టారండి. మీతో ఒక్కమాట చెప్పాలి"

"ఇక్కడ చెప్పరాదూ?"

"కాదు. రండి"

"ఇక్కడ చెపుదూ ?"

వూరుకుంది.

"భయమా?" అంది. ఆ కంఠంలో ఛాలెన్జి" నేను ఊహించలేక పోయాను.

"సరే, పద"

తలుపుతీసి గదిలోకివెళ్ళి, గడియవేసింది. ఎవరు వొస్తారో, తలపు తడతారో అని నాకు సిగ్గేసింది. కాని పైకేమీ కనపరచ తలుచుకోలేదు. ఆ గదిలో మూల మంచమూ, దానిమీద జంపకానా, మురికి తలగడా, మూల పెద్దకుండా, కిందంతా బీడీపీకలూ వున్నాయి.

"ఏమిటి?"

చిరునవ్వుతో, నా దగ్గిరిగా వస్తూ, పమిటని చమత్కారంగా దానంతట దాన్నే జారనిచ్చి, నా చేతిని పట్టుకుని తన రొమ్ముమీద ఆనించుకుంది.

ఆ గదీ, ఆ పక్కా, ఎవడో కాల్చివేసిన ఆ బీడీపీకలూ, అర్థంగా పద్మాయిగాని, లేకపోతే లోహంవలె నిగనిగ మెరిసే, ఆ వెచ్చని గట్టి వక్షంమీదనించి నా చెయ్యి తిరిగి వొచ్చునా ? గర్వంగా పైకితిరిగి, కొవ్వెక్కివున్న ఆ సౌందర్యాన్ని చూడనా, ఆ చుట్టుపక్కల తీర్చైన గుండ్రదని వొంపుతో కలకలలాడే ఆ మెడనీ, పొట్టనీ, చేతుల్నీ చూడనా? ఆ దృశ్యంతో నా జన్మానికి కావలసిన సౌందర్యమంతా పొందానని పించింది.

"వొద్దు" అన్నాను కష్టంతో చెయ్యితీసేసి.

"మీరెందుకు నన్ను తాకారు యిందాకా?" అని కళ్ళతో పోట్లాడింది, వెక్కిరించింది, సవాలుచేసింది.

"నీకు డబ్బు దొరికిందిగా! ఇంక వాతోనేం పని ?"

"అంత నీచురాల్ని కాదు"

మళ్ళీ కన్నీళ్ళు కళ్ళల్లో నిండాయి. ఆ పెదవి లోపలికిపోతోంది. ఏం చెయ్యను? ఇంక నా మనసు స్వాధీనం తప్పుతోంది. వెళ్ళబోయినాను చెయ్యిజాచి నా నోటు నా చేతులోపెట్టి మూసింది. చెయ్యి జాచినప్పటి బుజందగ్గరి గొప్పతనం నా కాళ్ళనీ, కళ్ళనీ ఆపింది.

"మరి రాత్రి భోజనం?"

కళ్ళతో కాల్చేట్టు నావంక చూసింది.

"నామీద కోపమా?"

"మా వంటి నీచులకి కోపంవస్తే నేం లెక్క!"

"అదుగో కోపం !"

"నాకేం కోపంలేదు. వెళ్లండి."

"ఈ నోటు తీసుకో."

"డబ్బు వుచితంగా తీసుకునే గతికి రాలేదు."

"అట్లా తీసుకోడంకంటె అన్యాయమా?"

కొంచెం వూరుకుంది.

"నీ స్నేహితుణ్ణి, నీకు యిస్తున్నాను. బహుమతి ఇస్తున్నాను, పాపం నువ్వు వస్తుపడుకున్నావే- దిగులుతో - తీసుకో."

అని ప్రేమతో ఆమె చెంపమీద చెయ్యేసి, ముఖం పైకెత్తిచూశాను. ఆమె చప్పున రెండు చేతులూ మొహం మీద పెట్టుకుని యేడ్చింది. ఆ తుఫాను వొస్తుందని ఎదురుచూస్తూనే వున్నాను. ప్రతి కన్నీటిచుక్కనీ, తడి అవుతున్న కనురెప్పల్ని ముద్దులతో తుడిచి, పక్కన కూచుని అడిగాను!

"ఎందుకు ఏడుస్తావు ?"

చాలా సేపు చెప్పక తిప్పలు పెట్టింది. కాని నాతో యేదో చెప్పాలనే వుద్దేశ్యంతోనే వుందని నాకు తెలుసు.

"నేనా డబ్బడిగింది నాకోస మనుకున్నారా ? నా వృత్తి, నా జీవనం అదే, కాని నా కిష్టమా ?.... నన్ను నా మేనత్త కొడుక్కే యిచ్చి పెళ్ళిచేశారు. మొదటినుంచి మా యింటో మాకీ తోటవల్లవచ్చే ఆదాయం కన్న సుకంగా బతకడం మామూలు. ఇప్పుడాలోచిస్తే ఆపైఖర్చు మా అమ్మ సంపాయించేదే మోనని అనుమానం. నాకు బుద్ధి తెలిసినప్పట్నించి మేము అలివిగాని అప్పుల్లో వుండేవాళ్ళం, ఎవళ్ళెవళ్ళో రహస్యాలు మాట్లాడడం, వెళ్ళడం, ఏవో కాయితాలూ, తగాదాలూ జరుగుతోనే వుండేవి. ఒకరోజు రాత్రి నాతో ఏం చెప్పకుండానే అమ్మ నన్ను వెంకయ్యకి వప్పచెప్పింది. వెంకయ్య మాకులంవాడే. అదేదో దేశంలో లేసుల వర్తకంచేసి డబ్బు సంపాయించాడు. అతనికి మేము ఏడువందలు బాకీ నేను నిద్రపోతూవుండగా వొచ్చి పట్టుకున్నాడు. చప్పున లేచి అరిచాను. కాని నాన్ననిగూడా తీసుకుని అమ్మ యెక్కడికో వెళ్ళింది. అమ్మ చెప్పిన మాటకి యెదురాడడం నాన్న కెన్నడూ లేదు.

నా కట్లాంటిది కొత్త. అప్పుడు ఏమీ అర్థంగాక వాణ్ణి తోసి యీ తోటంతా పరిగెత్తాను....వాడు వెనకా నేను ముందూ, ఆ వెన్నెట్లో యీ చెట్లల్లో యెట్లా పరిగెత్తానని ! అదే చీకటైతే వాడికి దొరికేదాన్నా ! చివరికి ఆ పుల్లరేగి పొదవెనక వగరుస్తున్న నన్ను పట్టుకుని కిందపడేశాడు. అప్పటికీ నా వూపిరి చివరవరకు పోట్లాడాను. ఇంక శక్తిలేక అతనికేసి చూస్తూ కాళ్ళూచేతులు వేళ్ళాడేసి పడుకున్నాను. ఏమనుకున్నాడో యేమో నా తలని కిందవేసి బాది

మీద వుమ్మేసి, అమ్మనీ, నాన్ననీ తిడుతో బెదిరిస్తో వెళ్ళిపోయినాడు. కదిలే శక్తిలేక అక్కడే పడివున్నాను, బట్టన్నా సరిగా వొంటిమీద లేకండా, అరగంటలో అమ్మవొచ్చి నన్ను కొట్టడం ప్రారంభించింది. వాడికి లోబడ్డందు కనుకుని, వాడు నన్నేం చెయ్యలేదని అరిచాను. ఆ మాట అనేప్పటికల్లా మరీ కొట్టింది. ఆ "ఐదువందలూ ఎవరు తీరుస్తారు. నీ మొగుడొచ్చి రక్షిస్తాడా" అని మళ్ళీ కొట్టింది. ఏం రాత్రి అబ్బా అది. మర్నాడురాత్రి వాడు వొచ్చాడు. నన్ను తాకితే చంపుతానన్నాను అమ్మ నన్ను యింటోంచి వెళ్ళకొట్టింది. నా మొగుడు రంగూను వెళ్ళాడు. కనక నాకు దిక్కులేదు.

అప్పుడే ఈ ఫ్యాక్టరీ కడుతున్నారు. కూలికి కుదిరాను ఒకనాడు ఆ మేస్త్రీ చిల్లరలేదని కూలీ యివ్వడం ఆలస్యంచేసి చీకటిపడ్డదాకా వుంచాడు. నాకు భయమేసింది, వెళ్ళాలనిపించింది, కాని ఈ డబ్బులు తీసుకువెళ్ళకపోతే తిండిలేదు. నన్నా మొండి గోడలమధ్య పట్టుకున్నాడు. వాడినెత్తిమీద రాయి విసిరికొట్టి పరిగెత్తాను. వాడికి దెబ్బ తగిలిందో, చచ్చాడో అని రాత్రంతా పోలీసువాళ్ళు వస్తారనే భయపడుతోనేవున్నాను, ఆ రాత్రి తిండిలేదు. భయం. ఎక్కడెక్కడో తిరిగాను. మర్నాడు చెట్టు కింద పడుకునివుంటే నాకు తెలిసినదొకత్తె వడ్లమరలోకి పనికి తీసి కెళ్ళింది. వెళ్ళినరోజునించి, ఆ మరాయన బ్రాహ్మడు నన్నెగాదిగా చూడడం, నన్ను వృధాగా పలకరించడమూ, చూసి యెంతో భయమేసింది. ఇంక ఈ మొగాళ్ళనించి తప్పించుకోలేనా ? యీ అందం నాకెక్కడ దాపరించింది ? బైటికి వెడితే మొగాళ్ళు నావంక తేరిబారచూడడమే ఇది వరకు నాకామాపుల అర్థం తెలీలేదు. తురకాళ్ళు వాళ్ళ ఆడవాళ్ళకి బురకాలెందుకు వేస్తారో అప్పు డర్థమయింది నాకు. కొందరిచూపులు, తాకడం కంటే కూడా, ఇంకేమో చెయ్యడం కన్నా కూడా అసహ్యంగా దుర్భరంగా వుంటాయి. ఒక్కొక్కడు నావంక చూస్తే, యెదురుగావెళ్ళి మొహంమీద వుమ్మెయ్యా లనిపించేది. ఆ మరలో వారానికొకసారిగాని కూలివ్వరు. ఆ వారంరోజులూ నన్ను తీసికెళ్ళిన మనిషిదగ్గర బదులుచేసి తిన్నాను. ఆఖరు రోజున మర రాత్రి పనిచేస్తున్నది రమ్మన్నాడు. రాత్రులు వీల్లేదన్నాను. రాకపోతే నీ జీతం అనలివ్వను పొమ్మన్నాడు. దీని అప్పెట్లా తీర్చను ? భయపడుతోనే వెళ్ళాను. తక్కిన

మనుషులెవరూ రాలేదు. ఆయనవొచ్చి నా చెయ్యి పట్టుకున్నాడు. నే నట్లాంటిదాన్ని కానన్నాను. నన్నా ఫ్యాక్టరీలోకి లాక్కెడుతున్నాడు. నేను మాలదాన్ని నువ్వు బ్రాహ్మడివి ఇది తగదన్నా వినలేదు. పైగా ఐదురూపాయలు చేతులో పెట్టాడు. అరిచినా చుట్టూ ఎవరూలేరు. వాళ్ళ యిల్లొక్కటే అక్కడ దీపం తలుపులోంచి కనపడుతోంది. చప్పున చెయ్యి వొదిలించుకొని పరిగెత్తాను. ఆయన తల్లీ భార్యా వున్నారు. ఏడుస్తో వాళ్ళ కాళ్ళముందు పడ్డాను.

"ఛీ. ఛీ. మాలదానివి పొమ్మ"ని లేచారు.

"యీ మాలదాన్ని పట్టుకునే మీ కొడుకు సంగతేమిటి ? అన్నాను.

ఆ మహాతల్లి కత్తిపీట విసిరివేసింది. ఆయన ఇంతలో నా కోసం వచ్చాడు. వాళ్ళముందే వాళ్ళిద్దరిముందే, నన్ను పట్టుకోబోయినాడు. కత్తిపీట తీసి వాడిమీద విసిరివేశాను. ఏమయిందో ! పరిగెత్తాను. అర్ధరాత్రి పోలీసులు నన్ను పట్టుకున్నారు. ఆబ్రాహ్మడి మొహం తెగిందట. పైగా వెండిగిన్నె యెత్తికెళ్ళానన్నారు. ఆ రాత్రి కైదులో మకాం. మర్నాడు ఒక ఇన్స్పెక్టరు ప్రశ్నలడిగాడు. నేను జరిగింది చెప్పాను. వాళ్ళేదో మాట్లాడుకుని నన్ను మళ్ళీ తాళం వేశారు. ఆ కైదూ, ఆ పోలీసులూ, నాకు భయంగా వుంది. దిక్కులేదు, నన్ను చంపుతారో యేమో! ఇంకెన్నడన్నా వొదులుతారో లేదో ! ఎప్పుడూ గాలిలో, చెట్లకింద తిరిగే నాకు ఆ కొట్టు యెట్లా వుందని ! చావనన్నా చస్తాను. కాని ప్రతి నిమిషమూ వూపిరి బిగపట్టి ప్రాణాలు బిగించే ఆ కొట్టులో కూచోలేను. ఆ సాయంత్రం యిన్స్పెక్టరు కాళ్ళమీదపడి యేడ్చాను, నన్ను వొదలమని. ఆ రాత్రి పోలీసు అతను నా దగ్గరికి వచ్చి బలవంతం చేశాడు. నన్ను వొదిలిపెట్టడం తన చేతిలోనే వుందని, వొప్పుకుంటే మర్నాడుపొద్దునే ఇన్స్పెక్టరుతో చెప్పి వొదిలిస్తానన్నాడు. ఏమైనాసరే, ఏ పాపం చేసైనా సరే, బైట పడాలనిపించింది. కాని నేనెంత వొప్పించినా సిగ్గు తిరగబడ్డది. ఆ రాత్రి నేరం వొప్పుకొమ్మని నన్ను కొట్టారుకదా ! బాబూ ! మళ్ళీ న్యాయమంటారు, ప్రభుత్వమంటారు, దేవుడంటారు, అబలల్ని రక్షిస్తాడంటారు, దేవుణ్ణి యెన్నిసార్లు పిలిచానో దెబ్బలుతింటో ! ఎందరెందర్నో కాపాడాడుకదా ! ఎందరో పాపాత్ముల్ని రక్షించినవాడు నన్ను రక్షించలేదేం ? ఇంక దేవుడిమాటవిని

పాపం చెయ్యకుండా నే నెందుకువుండాలో. పోనీ, నేనేమన్నా తప్పుచేస్తే దేవుడికి కోపం రావచ్చు. ఏం చేశానని నా కన్ని కష్టాలు ? నా మానం కాపాడుకున్నందుకే కదా, నా కన్ని తిప్పలు ? అక్కణ్నించి తప్పించుకో వొచ్చుననే ఆశ కూడా వుంది. నాకు లోకంమీద, మనుసులమీద, నా మీదా అసహ్యం పుట్టింది. మాట్లాడకండా పడివున్న నన్ను తన ఇష్టమొచ్చినట్లు చేసిపోయినారు. వెళ్ళేప్పుడు అతని చెయ్యి పట్టుకుని 'నన్ను మరి తప్పకుండా వొదులుతావుకద' అన్నాను. తల వూగించి పోయాడు. ఇంక నా సిగ్గునేం చెప్పను ? అతని తరువాత యింకోడు. ఎందరో ! అట్టానే బిగుసుకుని పడివున్నాను. నేను కదలకపోతే 'ఏం మాట్లాడవేం, కదలవేం, అని ఎక్కడెక్కడో గుద్దారు. ఆ రాత్రితో నాకున్న అభిమానమూ, ధర్మబుద్ధీ, లోకంలో విశ్వాసమూ పోయినాయి. లోకమంతా డబ్బే, డబ్బుకోసమే వుంది. ఎట్లానూ మా బోటివాళ్ళం శీలాన్ని కాపాడుకోలేము. ఎట్లానూ పోతున్న శీలాన్ని, దాచుకోవాలని చూసి యీ బాధలెందుకు, వచ్చే డబ్బుని వదులుకోవ మెందుకు ? తెలివితక్కువ. ఎంత మోసంచేస్తే అంత సుఖపడతామని రూఢి చేసుకున్నాను. మీకేం అదృష్టవంతుల్లు. డబ్బడిగిన మాత్రాన చీదరించుకుంటారు. మర్నాడు నా తండ్రికి కబురంపించి నన్ను వప్పగించారు. ఆనాటినించి నన్ను వెంకయ్య వుంచుకున్నాడు. నగలిచ్చాడు, బట్టలిచ్చాడు, తాగించాడు ! కడుపునిండా బువ్వపెట్టాడు. అమ్మదెబ్బల నించి తప్పించాడు. ఇంకో మొగాణ్ణి నా వేపు కన్నెత్తకండా చేశాడు, ఆయన బతికివున్నాన్నాళ్ళూ నా మొగుడు నాకోసంవస్తే అతని నోరు మూసి మళ్ళీ రంగం పంపాడు. ఆయన చచ్చాడు. తరవాత యేం చెయ్యను ? నేను రెండు రూపాయలు తీసుకొస్తేనేగాని యిల్లు గడవదు. గొప్పబతుక్కి అలవాటు పడ్డాము, వెంకయ్యధర్మాన. సొమ్ము తీసుకొస్తేనేగాని అమ్మ వూరుకోదు. తిరగబడ్డానా మళ్ళీ దేశాలపాలు. అక్కడా మొగాళ్ళు ఇంతే! ఎక్కడా తప్పదు నా జీవితానికి! ఈ అందమే నాకు శత్రువు. ఈ బతుకు తప్ప నాకు శరణ్యంలేదు. ఇప్పటికీ డబ్బు అడగడం ఎంతో కష్టంగా వుంటుంది. కాని ఏం చెయ్యను ? మీరు చెప్పండి ?

★ ★ ★

# ముక్తిమార్గం

సిద్ధులూ, బైరాగులూ, సన్యాసులూ, వీళ్ళందరిదగ్గరా మహత్తరమైన మూలికలుంటాయనీ, కటాక్షం కలిగినప్పుడు భక్తులకూ, తదితరులకూ, వాటిని అవ్యాజంగా యిస్తారనీ అందరికీ నమ్మకమైన విషయమే ! నా తలనొప్పిబాధకూడా పోగొట్టుకోడానికని అట్లా ఏదన్నా లభ్యమైతుందేమోనని ఆశపడి, బూడిద పూసుకున్న ప్రతివాడి వెనకా తిరుగుతున్నాను. రామేశ్వరంలో. వాళ్ళ బాష నాకు రాకపోవడం గట్టి చిక్కొచ్చింది. వొచ్చీ రాని అరవంలో ఒక బోసిమునిని తలచూపి మందిమ్మని అడిగేటప్పటికి. ఆ ముసలియోగి. "నాకో కాలనాయిమ్మ"ని వెంటపడ్డాడు. ఇంకోడు తన వొంటి బూడిద నా తలకిరాసి, పావలా డబ్బులు, లాగాడు. అరవసన్యాసులు. మళయాళ యతులు. పంజాబు బైరాగులు, బెంగాలీ బోగులు, అందరూ వున్నారుగాని, ఒక తెలుగు బూడిదవాడెవడూ కనిపించలేదు. అర్థమయ్యేట్టు నాభాద చెప్పుకోవాలంటే.

ఇంక మావూరికి తిరిగిపోదామనుకుంటో, గంధమాధనం చూచి మరీపోదామని బైలుదేరాను. బైలుదేరేటప్పటికే నాలుగున్నర దాటింది. మెల్లిగా యిసికలో కాళ్ళీడ్చుకుంటో పోగా పోగా గంధమాధన శిఖర దర్శన మయ్యేప్పటికే సూర్యుడు కుంకుతున్నాడు. ఈప్రదేశాలన్నీ రాముడూ తమ్ముడూ యెట్లా తిరిగారా, వాళ్ళకి ఏం తోచిందా, అన్నిరోజులు యిద్దరవా మాట్లాడుకుంటున్నారా అనుకున్నాను. ఒక ఆడది వుంటే, యెన్ని కబుర్లన్నా వొస్తాయి. కాలం తెలీకండా గడిచిపోతుంది. కాని యిద్దరు మొగాళ్ళు-అందులో అన్నతమ్ములు-వాళ్ళని తలుచుకుంటే జాలేసింది. కవికేం ? మూడునెలలు చాలా సుఖంగా సంచరించారు. అని ఒక పద్యములో మూడునెలల కాలం అరనిముషంలో కొట్టేస్తాడు. దోవలో, ముళ్ళు రాళ్లు, పాములు, యివి కవి

కంటికి కనిపించవు. ఎక్కడ పడుకున్నారు ? ఏం తిన్నారు ? అని ఆలోచనే అక్కర్లేదు. ఆకులుతిని ఆర్నెల్లుసుఖంగా బతికారని సులభంగా అంటాడు ఒక కందపద్యంలో, ఏ ఆకులు ? అవి రుచి యెట్లావున్నాయి? నోరుపొక్కి యెంతయేడ్చారు ? జీర్ణ మెట్లా ఐనాయి ? ఆర్నెల్లు తిన్న తరువాత ఆ మనుషులు గుర్తుపట్టేట్టు వున్నారా ? ఆ సంగతి ఏమీ మాట్లాడడు కవి. పోనీ, ఆర్నెల్లుకాదు. ఆరురోజులు నువ్వు ఆ అడివి ఆకులు తిని వుండు ఆనందంగా అని ఆ కవిని నట్టడవిలో వొదిలితే తెలుస్తుంది. ఆ రాతలేమిటో!

ఆ పర్వతాన్ని హనుమంతుడు. తొక్కాడు గావును ఇప్పుడు పుత్తగుట్ట దానిమీదవున్న గుడిమీద, గుడిమీదవున్న డాబామీద ఎక్కాను. ఆ పర్వతంమీద నించి రాముడు మొదట చూశాట్ట లంకని. లంకకోసం వెతికాను గాని కనపళ్ళేదు కాని దృశ్యం మాత్రం అతి గంభీరమైనది. రాముడంతటి చక్రవర్తి చూడతగినది. ఆగుట్టమీద రామలక్ష్మణులు ఆజానుబాహులు నుంచుని, మూడువేపుల సముద్రాలను, ఆ యిసిక పర్వతాలనూ, ఆ పెద్ద సమ ప్రదేశాలనూ, పరిశీలించడం తలుచుకున్నాను. అట్లా ధ్యానంలో పడ్డాను. మెల్లిగా చీకట్లుకమ్మాయి. చంద్రుడు బలం తెచ్చుకుంటున్నాడు. సముద్రం మీద పక్షులు గట్టుకు వస్తో అరుస్తున్నాయి. స్పష్టంగా కనపడే చెట్లూ, కొండలూ, చీకట్లో దాక్కుంటున్నాయి. వెనకాల యెవరో

"జయ్ శీతారామ్" అన్నారు.

మొదట వాల్మీకి వొచ్చాడనుకున్నా - బాగా బలిసిన పెద్దశరీరము వాడు, పెద్దగడ్డము, రుద్రాక్షలూ, కమండలము కలవాడొకడు వొచ్చి మంటపము దగ్గిరగా కూచున్నాడు. ఆయన ముఖం స్పష్టంగా కనపడక పోయినా, ఆయన తప్పక నాబాధ మాన్పగలడనిపించింది. సమీపానికి వెళ్ళి కూచున్నాను.

"ఏవూరూ అబ్బాయీ" అని గోదావరిజిల్లా తెలుగులో పలకరించాడు. నా ఘోష చెప్పుకున్నాను. అంతా కళ్ళుమూసుకు విన్నాడు. ఆనాటితో నాబాధ గట్టెక్కిందనే ధైర్యం యెక్కువైపోయింది.

"ఈ తలనొప్పి వొక్కటేనా నీబాధ ?"

"ఇంకేంలేదు-అదే నాప్రాణం తీస్తోంది."

చిరునవ్వు నవ్వాడు.

"తలనొప్పి కుదురుస్తాననుకో. ఇంక బాధలుండవా ? తరువాత ?"

"వుండకేం ? మానవజన్మ మెత్తింతరవాత వుండకండా వుంటాయా ? అప్పుడు చూసుకుంటాను వాటిసంగతి."

"అవును. మానవజన్మమే బాధ-ఒకటి పోతే ఇంకోటి, ఒకటి లేకపోతే యింకోటి. అసలు బాధలేని వుపాయం, కనిపెట్టాలిగాని-"

"అసలు బాదలేని వుపాయం ఏముంది ?-చావుతప్ప"

"చస్తే బాధలు పోతాయా ? పోతే అందరూ చత్తారు, కాని వొకటే సాధనం-"

"అది-"

"ముక్తి."

యోగుల చిట్కాలలో నమ్మకమున్నా, వాళ్ళ మహిమల్లో మంత్రాలలో నమ్మకంలేదు నాకు. అందులో ముక్తి స్వర్గం అంటే, ముసలమ్మ కబుర్ల లాగుంటాయి.

"ముక్తి అంటే-"

"ముక్తి అంటే-జన్మరాహిత్యం"

"ఈ తలనొప్పులతో, యీ బాధలతో, దారిద్రంతో అన్నీటితోటి కూడా జీవితమంటే నాకు చాలా మధురంగా వుంది. జీవితం లేకుండా శూన్యం తలుచుకుంటేనే నాకు భయం కలుగుతుంది, నాకు జన్మ రాహిత్యం వొద్దు."

నవ్వాడు-పెద్ద వుపన్యాసానికి తయారవుతున్నట్టు కాళ్ళూ వెన్నూ సద్దుకున్నాడు. నా తలనొప్పి కుదురుతుందనే ఆశలు అడుగంటుతున్నాయి పైగా అర్థరాత్రిదాకా, యీ వేదాంతోపన్యాసం పట్టుకుందే, వొదిలించుకోడం యెట్లానా అని ఆలోచించాను.

"నీకు జన్మరాహిత్యం వొద్దుగాని, ఏంకావాలి ?"

"అన్నీ కావాలి, ధనము, కీర్తి, ఆరోగ్యం, అధికారం"

"ఇవన్నీ యెందుకు నీకు ?"

"అవంటే నాకు యిష్టం."

"ఎందుకు యిష్టం ?"

"వాటివల్ల నాకు ఆనందం."

"కనుక నీకు కావలసింది ఆనందం-వీటన్నిట్లోనూ కావాలి.

ఒకటే సూత్రం వుంది-ఆనందం తిండిలో, నిద్రలో, అధికారంలో అన్నిటిలోనూ ఆనందమే ప్రధానం-కాని కొన్ని చిన్న ఆనందాలు, కొన్ని గొప్పవీ, కొన్ని క్షణికాలూ, కొన్ని దీర్ఘాలూ-కాని అన్నిటిలోనూ కలసి మిశ్రమములై బాధలూవున్నాయి. అనంతమైన, అత్యున్నతమై, బాధారహితమైన ఆనందాన్ని ముక్తి అంటాము-కడుపునొప్పి వెగటూలేని తిండీ; భయములేనికీర్తి! అధికారమూ; అలసటలేని మైధునమూ; విసుకులేని రాగమూ-యివన్నీ కలిసి యింతేకాదు. నీ మనసుకు అందని అనేకకోట్ల సౌఖ్యాలు ఏకమైన ఆనందం ముక్తి.

"ముక్తి ఆనందమా ?"

"అంటే జన్మరాహిత్యంకాదూ ?"

"అవును. జన్మరాహిత్యమెప్పుడవుతుంది ? పరమాత్మలో ఐక్యమైనప్పుడు ఆ ఐక్యం కావడమే, నిరంతర అవ్యయానందం, ఆ లోకంలో కూడా ఆనందం అంటే ఐక్యం-పువ్వుల వాసనతో, రంగుల కాంతితో ఐక్యం కావడం ఆనందం, వీటికన్నిటికి కారణమైన పరమాత్మతో ఐక్యం కావడం ముక్తి. జీవాత్మా, పరమాత్మా సంయోగం."

"యెట్లా అది పొందడం ?"

"అసాధ్యం. ఎట్లా పిల్లవాడికి స్త్రీ వాంఛ అసంభవమో అట్లానే. మీరందరూ పిల్లలు-యీవిద్యలో, ఆ యౌవనం పదేళ్ళలో వొస్తుంది. ఈ యౌవనం పది యుగాల్లోకూడా రాదు"

'ఐతే ఎందుకీ ఉపన్యాసం ?'

అన్నాను వొళ్ళుమండి,

'తొరగా ఎదగమని చెపుతున్నాను.'

'ఎట్లా ?'

'ముందు రాబోయే మహదానందం అనేకరూపాల మీకు ధ్వనిస్తొనే వుంది. ఈ పరమాత్మకీ జీవాత్మకీ సంయోగంలోవుండే మాధుర్యం. జీవాత్మకీ. జీవాత్మకీ సంయోగంలో కనపడుతోంది. అదేప్రేమ- ఆ ఆత్మలు నివసించే దేహం సంయోగంలోవుంది ఆ మాధుర్యం. తలుచుకో. ప్రతినరమూ, ప్రతి అవయవమూ, ఆవేశంతో వొణికిపోతూవుంటే మనసూ ప్రాణమూ ఏకాగ్రమై, ఐక్యమైపోయే సమయంలోని ఆనందం, అదేముక్తి. కోర్కెలు తలపులు, భావనలు, అన్ని యింకో వ్యక్తితో ఐక్యమైన ప్రేమని తలుచుకో, అదేముక్తి. అది కొన్ని నిమషాలే. అర్థమౌతుంది జీవులకి. కాని పరమాత్మలో ఆ అనుభవం అనంతమౌతుంది. అన్ని అనుభవాలలోకీ శ్రేష్టమూ, అప్రమేయమూ. సంయోగం అది సృష్టికర్త చెందే అనుభవము. ఇంకోనూతన ప్రాణిని కల్పించే ఆనందం-"

"ముక్తిసాధన అదేనా ?"

"సందేహంలేకండా. ఆత్మవికాసమే ముక్తిమార్గం. యోగం, జ్ఞానం, కర్మ, భక్తి అన్నీ కూడా ఆత్మవికాసానికే సాధనాలు. ఈ ప్రపంచంలో ఎంత ఐక్యమైతే అంత ఆత్మ వికాసం కలుగుతుంది. ప్రపంచమంటే సృష్టి. సృష్టి శరీరాల ఐక్యంవల్ల కలుగుతోంది. ముక్తి అంటే ఐక్య ముక్తివల్ల సృష్టి కల్గుతోంది. సృష్ట మళ్ళీ ముక్తిపొందుతోంది. ఈ నదులు పర్వతాలు వృక్షాలు, జంతువులు మనుషులు, అందరూ నీవే అనే ఐక్యభావం రావాలి. ఈభావం ప్రతివాడికి సంయోగంలోని రెండు నిమిషాలలోనూ తోస్తోంది. అవునా కనక ఆకార్యంలో ప్రతి వ్యక్తీ ముక్తిని రుచి చూస్తున్నాడు. ఆత్మవికాసానికి ముఖ్యసాధనం సంయోగం- ఏ వ్యక్తి ఆజాతి వ్యక్తితో ఎంతమందితో, ఎన్ని విధాల సంయోగం పొందుతాడో అంతముక్తికి సన్నిహితుడౌతాడు."

"మరి పాపమంటారు ?"

'అంటారు-పాపమేమిటి ? ఆత్మవికాసమే ముక్తి, పాపం యీ మూర్ఖులకి. వాళ్ళకి ఆనందం తెలుసా ? వృక్షాలకి తెలుసు. కీటకాలకు అంతకన్న ఆ ఆనందంతెలుసు. జంతువులకి యింకా కొంత. మనుషులకి అధికానందముంది దాంటో. అందులో రసికులూ ఆత్మఔన్నత్యం కలిగినవాళ్ళూ పరిపక్వం చెందిన వాళ్ళూ, ఇంకా అతీతమైన ఉన్నతా వస్థను పొందుతారు. క్షుద్రులకు ఆ ఆకర్షణే వుండదు. పశుప్రాయులు వాళ్ళకి ఆత్మ వికాసంలేదు. ఒక్క వ్యక్తి అనుభవంతో-ఏ జంతువైతేనేం దాంతో తృప్తి - పడతారు. - ఆత్మయెప్పుడూ ముక్తికోసం బాధపడుతుంది. పరమాత్మ పిలుపునువిని రెక్కలు కొట్టుకొని విజృంభించడానికి ప్రయత్నిస్తుంది- ఈశ్వరుడు సౌందర్యమూర్తి. సౌందర్యమంతా యీశ్వరుడు సౌందర్యమే ఆనందం-సుందర తేజం, సుందరధ్వని, సుందరరసన- సౌందర్యాన్ని గుర్తించి అన్వేషించి వాంఛించనివాడు అధముడు-సౌందర్యంతో-వివిధ రూపాలు, వివిధములైన మార్పులుపొందే, సౌందర్యాన్ని అనుభవించడంలోనే ఆనందం- ఇంతకన్న ఆనందదాయకమైనది ఆ ముక్తి మాత్రమే !

ఎంత రసికుడో, యెంత సౌందర్యోపాసకుడో మనిషి, అంత యీశ్వరప్రియుడు-ఎంత అనుభవాన్ని వాంచిస్తాడో, ఎంత సంయోగాన్ని పొందుతాడో-అంత యీశ్వరుణ్ణి ప్రేమిస్తాడు-ఎన్ని విధాలైన సౌందర్యంతో - ఎంతమంది వ్యక్తులతో ఐక్యమౌతాడో-యెంతమంది స్త్రీలను ప్రేమించి కామిస్తాడో అంత ఆత్మవికాసం పొందుతాడు-

దిగ్భ్రమచెంది కళ్ళు తెరిచాను.

యోగి అంతర్ధానమైనాడు-నా తలనొప్పితో సహా-

నా చుట్టూ ప్రపంచమంతా వెన్నెట్లో ముకుళించుకు పడుకుంది. నా హృదయంలో నూతన జ్ఞానజ్యోతి వుదయించింది.

★ ★ ★

# పునర్వివాహం

వెంకటశివుడూ భార్యా కలిసి వితంతుశరణాలయం స్థాపించారంటే, వాళ్ళిద్దరూ అంత మంచి వాళ్ళయినా, లాభంమీద వాళ్ళకి దృష్టి లేకపోలేదు. బాలవితంతువులపైన అతనికి కాంక్షలేదు. వాళ్ళ నగలమీద ఆమెకే కాంక్షలేదు. అంతవరకే వాళ్ళమంచి. శరణాలయాన్ని వృత్తికింద వాళ్ళు అభిప్రాయ పడలేదంటే అది సరికాదు. శరణాలయాలు నిలబెట్టి కొన్ని పెళ్ళిళ్ళు చేయించినవాళ్ళకి పంజాబులో ఎవరో ధనసాంవత్సరీకాలు ఇస్తారని కూడా తెలుసు వాళ్ళకి.

కాని ఆర్నెల్లయినా ఒక్క వితంతువూ చేరలేదు. ఆరేళ్ళకిందట పోరుపడలేక తాను తరిమేశిన నాయనమ్మని, ఏదో ఒక వితంతువు వుందని చూపించుకోడానికి తీసుకొద్దామని కోటిపల్లివెళ్ళి, ఆమెలేక తానెంత నాశనం అయిపోయినాడో చెప్పి వొప్పించాలని చూశాడుగాని, ఆమె ఒక ఎకరం భూమి రాసిస్తేనేగాని రానంది. చచ్చిపోయిన తనపరమమిత్రుడి యవ్వనవితంతువుని వొచ్చి, తన శరణాలయాన్ని అలంకరించి రక్షించమని ప్రార్థిస్తే, పొరుగింటి కంసాలిని, అతని కుటుంబంతో సహా తనతో తీసుకుని రానిస్తేనేగాని రానంది ఆమె. చివరికి వెంకటశివుడుతానే చచ్చిపోయి తన భార్యని వితంతువుగా నిలబెడదామన్నంత డెస్పరేట్ అయినాడు.

ఏమిటా ఇట్లా అయిందని ఆలోచిస్తో వుండగా వాళ్ళ అదృష్టాన ఒక దరఖాస్తు వొచ్చింది. వెంటనే రమ్మని రాశారు. మళ్ళీ తప్పిపోతుందేమోనని రాజమ్మ పొన్నూరు వెళ్ళి స్వయంగా వెంటపెట్టుకు ఆమెని తీసుకుని వొస్తానంది. కాని ఆత్రుత వల్ల కార్యం చెడుతుందని, బెట్టుగా వుత్తరం రాసి వూరుకున్నారు. ఆ వితంతువు వొక్కత్తా దిగింది. వయసు ఇరవైఏళ్ళు, చాలా

నవ్వుతో కలిసికట్టుగా వుంటుంది. చిన్నప్పుడే భర్తపోయినాడు. రెండునెలల్లో తనకి పెళ్ళి చెయ్యాలని చెప్పింది. కాని వరుణ్ణి ఏరుకోడంలో తనకె కొంత స్వతంత్రం కావాలనిఅంది. శరణాలయంలో వితంతువులు లేరుగాని, ఏరుల దగ్గిర్నించి చాలాదరఖాస్తులు వున్నాయి. ఒచ్చిన వితంతువు లక్ష్మి, వాటిని పరిశీలించి చాలావాటిని నిరాకరించింది. వాటిల్లో రెండింటిని ఏరి వాళ్ళని స్వయంగా పరిశీలిస్తానన్నది. వాళ్ళకి ఉత్తరాలు వెళ్ళాయి. వాళ్ళు వొచ్చాక ఇన్‌టర్‌వ్యూ లిచ్చింది. కాని వాళ్ళు ఆమెకు నచ్చలేదు. కాని కొత్త దరఖాస్తులు వొస్తూనే వున్నాయి.

బాపట్లనించి వొచ్చిన ఓ దరఖాస్తుదారుణ్ణి ఏరుకుంది లక్ష్మి. అతను ఫోటోకూడా పంపాడు. వయసు యిరవై అయిదు ఏళ్ళు. కులంకూడా సరిపోయింది. వర్తకం డబ్బువుంది. అతనువొచ్చాడు. లక్ష్మి అతనికి పెద్ద ఇన్‌టర్‌వ్యూ ఇచ్చింది. పెళ్ళికివొప్పుకుంది. పెళ్ళికి ఎక్కువ ఖర్చు చెయ్యలేనన్నాడు. ఆ వూళ్ళో నవ్వులపాలుకాకండా ఓ వివాహంకూడా జరిపిస్తున్నామని ఆ దంపతులకి చాలాసంతోషమైంది. మొదటి వివాహం గనక ఖర్చు కొంత చెయ్యాలనుకున్నారు. వూరివారి నందర్నీ పిలిచారు. బహిరంగభ కూడా జరిగింది. ఉపన్యాసకులు పాత మూఢాచారాన్ని బాగా ఖండించి, వెంకటశివదంపతుల ఉదారత్వాన్ని, సాహసాన్ని చాలా శ్లాఘించారు. ఆ వూరి హెడ్మాష్టరుగారు వెండి కప్పుని, ఓ డాక్టరుగారు పట్టు బట్టల్ని పెట్టారు వధూవరులకి. వివాహమై సలక్షణంగా వెళ్ళారు వధూవరులు.

రామచంద్రయ్య లక్ష్మి వివాహం ఏ ముహూర్తాన జరిగిందోగాని తరవాత మూడు సంవత్సరాలలో ఆశరణాలయంలో ముప్పై వివాహాలు జరిగాయి. చాలా వృద్ధిలోకి వొచ్చింది శరణాలయం. ఓసారి బాపట్లలో ఒక గొప్ప ఇంటి వితంతువు ఉత్తరం రాసింది. రహస్యంగా తనని ఇంట్లోంచి తీసుకునివెళ్ళి వివాహం చెయ్యమని. బాపట్లలో రామచంద్రయ్య సహాయంతో సున్నితమైన ఆ వ్యవహారాన్ని సాధించ వొచ్చుననుకున్నాడు వెంకటశివుడు. కాని రామచంద్రయ్య ఇంటిపేరు మరిచిపోవడంవల్ల అతని కోసం వెతకడం కష్టమయింది. ఆ వూళ్ళో అతని ఇంటో బసచెయ్య వొచ్చునని అనుకోవడం వల్ల రామంచంద్రయ్య కోసం వెతకడం ప్రాముఖ్యం వహించింది. ఎవరి

నడిగినా ఏ రామచంద్రయ్య అంటారు. వితంతు వివాహం చేసుకున్న రామచంద్రయ్య అసలు ఆ వూళ్ళో ఎవరూలేరు. విసికి సత్రానికి వెడుతో వుండగా బండీఅతను ఓ ఏడెనిమిదేళ్ళ కుర్రాణ్ణి చూపించి 'అతనేనండి రామచంద్రయ్యగారి అబ్బాయి' అన్నాడు. ఆ కుర్రాణ్ణి ఆపి.

"మీ నాన్నగారి పేరేమిటి?" అని అడిగారు వెంకటశివుడు.

"రామచంద్రయ్యగారు."

"మీ అమ్మ పేరు ?"

"లక్ష్మి"

"మీ ఇల్లు తాళంవేసి వుందేం ?"

"తాతయ్యగారి ఇంటో సత్యనారాయణవ్రతం. అక్కడికి వెళ్ళాం."

"తాతయ్యగారంటే ?"

"మా అమ్మ తండ్రి."

"మీ నాన్నగారు అక్కడ వున్నారా?"

"ఆ."

"రా బండీలో కూచో. నేను వస్తాను" అని బయలుదేరాడు వెంకటశివుడు.

లక్ష్మిది పొన్నూరుకాదూ ? తండ్రి ఆచారపరుడు. తనుకంట బడితే నరికేస్తాడు అని చెప్పింది. కాని మూడేళ్ళయింది మరి. తండ్రి బాపట్లకి మారాడు గావును. కాలం మారింది. తీరా పెళ్ళి అయ్యాక ఏం చేస్తాడు? కన్నకడుపు. కాని ఈ కుర్రాడికి ఏడెనిమిదేళ్ళు వున్నాయే ! పెళ్ళయి మూడేళ్ళేగా అయింది ? రామచంద్రయ్య మొదటి భార్య కొడుకేమో ! కాని తనకి పెళ్ళే కాలేదన్నాడు అతను.

ఎన్ని అబద్ధాలాడతారు యీ వితంతువివాహాల వాళ్ళు-ఏమైతేనేం దంపతులు సుఖంగావున్నారు. తనుచేసిన ఆ మొదటిపెళ్ళి చాలా మంచి కాపరంగా సుఖపడుతున్నారు. కాని....

"నాయనా, లక్ష్మేనా మీ తల్లి?"

"ఊ."

"ఆమెకే పుట్టావా !"

తెల్లబోయి చూశాడు కుర్రాడు.

"అంటే, నిన్ను పెంచుకున్నారా? ఇంకో అమ్మ వుండేదా నీకు?" దానికీ జవాబు చెప్పలేకపోయినాడు అతను.

ఇంతలో బండి ఇంటికివొచ్చి చేరింది. రామచంద్రయ్యగారి మామగారు పందిట్లో కూచున్నాడు. ఆయన రిటైరైన రిజిస్ట్రారు. వెంకటశివుణ్ణి కూచోమని కుశలప్రశ్నలు వేశాడు ఆయన. రామచంద్రయ్య ఇంట్లోలేడు. బజారు వెళ్ళాడు. లక్ష్మి వర్ధనలో వుంది ఈ మామగారు చాలా పూర్వాచారపరుడు.

"తమరిలాంటివారిని కలుసుకోవడం చాలా అదృష్టం. సుదినమిది" అన్నాడు వెంకటశివుడు.

"ఏదోలెండి. అయిపోయింది మాకాలం. వుద్యోగంఅదీ. చేసిన ఉపకారాలు చేశాను. కాని మరిచిపోయినారు అప్పుడే నన్ను."

'అది కాదండి. ఇంత పూర్వాచారపరులై వుండీ కూడా-వృద్ధులూ, పెద్దలూ మీవంటివారు వితంతువుల దుస్థితిని అర్థం చేసుకుని, ఏ సంకోచం లేకండా, ఈ పాడు సంఘాన్ని లెక్క చెయ్యటం లేదంటే చూడడం నా కెంతో ఆనందంగా వుంది"

రిజిస్ట్రారు తెల్లబోయి చూశాడు.

"వితంతువు వివాహాలా ! నా చెవుల బడనీకండి. చాలా ఘోరం. అట్లాంటివి వినడం మహాపాపం." వెంకటశివుడు తెల్లబోయాడు. తన కూతురు సంగతి దాచేస్తున్నాడు ఈయన ! తనకి ఫలహారం సంగతి అట్లావుంచి, కాఫీకూడా ఇచ్చేట్టులేదు. వెంకటశివుడికి వొళ్ళు మండింది. ఇంత దొంగలు వుంటారనుకోలేదు. అందరి ముందూ పరాభవం చెయ్యాలి. ఈ ముసలాయన్ని.

"లక్ష్మి సుఖంగా వుందండీ!"

"ఊఁ, వుంది. కాని లక్ష్మినేం ఎరుగుదురు మీరు?"

"మా శరణాలయంలో వుంది కదండీ."

"శరణాలయమా? మా లక్ష్మి వుండడమేమిటి? ఎందుకు వుంటుంది శరణాలయంలో?"

"మేమేగా ఆమెని రామచంద్రయ్యగారికి ఇచ్చి పెళ్ళిచేసింది?"

"మీరా?"

చుట్టూ చూశాడు ఆయన.

"మూడువేలు ఖర్చుపెట్టి నేను ఈ వూళ్ళో మా లక్ష్మికి పెళ్ళిచేస్తే, మీరా పెళ్ళిచేసింది? ఏ లక్ష్మి సంగతి మాట్లాడుతున్నారు?"

అందరూ ఆశ్చర్యంగా చూస్తున్నారు అతని వంక పిచ్చివాడేమో నన్నట్టు.

"ఎప్పుడు పెళ్ళిచేశారు?" అన్నాడు మళ్ళీ.

"మూడేళ్ళ క్రిందట."

అందరూ పకపక నవ్వారు.

"దాని కొడుక్కి ఏడేళ్ళున్నాయి. పెళ్ళయి ఎనిమిదేళ్ళయింది." వెంకటశివుడు లేవబోతున్నాడు. వీళ్ళుకాదు వాళ్ళు. రామచంద్రయ్య వొచ్చాడు. వెంకటశివుణ్ణి చూసి "ఎప్పుడు రావడం," అంటున్నాడు. ఇంతలో మామగారు, "ఈయన్ని ఎరుగుదువా? అదేమిటి, ఆయననీకేదో వితంతు వివాహం చేశాట్ట" అన్నాడు.

రామచంద్రయ్య మొహం తెల్లగా అయింది. అందరూ ఆగి వింటున్నారు.

"నా కూతురు లక్ష్మి వితంతువా ?"

రామచంద్రయ్య ఏం మాట్టాడలేదు. ఇబ్బందిపడుతో చూస్తున్నాడు వెంకటశివుడు. అన్యాయంగా రామచంద్రయ్య రహస్యాన్ని దేన్నో బైటపెట్టాను గావునని. మెల్లిగా రామచంద్రయ్య మొహంలోకి అణగకండా నవ్వు వొస్తోంది.

"బైటపడ్డదా ? అవును నిజమే, లక్ష్మికి నాకూ ఈయనేగా పెళ్ళి చేసింది?"

రిజిస్ట్రారు తనని అల్లుడు ఎగతాళి చేస్తున్నాడని గ్రహించాడు.

"వేళాకోళమా ఏమిటి నాతో!"

"కాదు నిజమే; మూడేళ్ళనాడు జ్ఞాపకంలేదూ వితంతు వివాహాల విషయమై పెద్దతగాదాపడ్డాం?" అని వెంకటశివుడి వేపుతిరిగి,

"క్షమించాలి మీరు, కొంచెం మోసంజరిగింది. మా వదినగారికి వితంతు వివాహం చెయ్యమని మామగారితో పెద్ద రగడ పెట్టుకున్నాను. అది అందరికీ తెలుసు. లక్ష్మి కూడా నా పక్షమే. మా వదినగారికి మతి చెరిచి మేము ఆమెని తీసికెడతామన్నంత భయం పట్టుతుంది మామగారికి. నిజంగా అంతపని చెయ్యాలనే అనుకున్నాం. చిన్నతనం. ఓ రాత్రి మాటలు పెరిగాయి మామధ్య.."

అని రామచంద్రయ్య చెపుతోవుంటే, రిజిస్ట్రారు మొహంలో భయం చూస్తే, ఆ వొదినగారికి విధవావివాహం చెయ్యాలన్న విషయంవెనక ఇంకా అవమానపుగాథ వుందనిపించింది వెంకట శివుడికి.

"నన్నూ లక్ష్మినీ ఇంటోంచి పొమ్మన్నారు ఈయన నేను లేనివాణ్ణి. వీరిమీదనే ఆధారపడ్డాను ఆనాడు తిండికి నిరాధారులం ఏం చేస్తాం ? మా అబ్బాయిని ఈ ఇంటో వొదిలేసి బైటపడ్డాం. నాకు త్వరలో ఉద్యోగ మౌతుందని ఆశ. ఆయన కోపమూ అట్టే రోజులు వుండదని తెలుసు. అందుకని లక్ష్మి ఆశ్రయంకోసం మీకు దరఖాస్తు పెట్టాము లక్ష్మి వితంతువు అని. అనుగ్రహించి లక్ష్మికి మీరు ఆశ్రయమిచ్చారు. తరవాత నాకు ఉద్యోగమూ అయింది.

మా వదినగారు ఇంక ఈ ఇంటో వుండడానికి వీలులేని పరిస్థితి వొచ్చి, పండరిపురం వెళ్ళిపోయింది. అందువల్ల మా మామగారు మమ్మల్ని క్షమించారు.

మరి మీ ఆశ్రయంనించి లక్ష్మిని తీసుకురావడం ఎట్లా? మీరు తనని చాలా దయగా చూస్తున్నారనీ, మీకు లేక లేక కలిగిన వితంతువును తాను వొక్కత్తెనేననీ, తనకి మీ శరణాలయంలో వివాహం జరగకపోతే మీ హృదయం భగ్నమైపోతుందనీ లక్ష్మి నాకు రాయడంవల్ల, వరుడికింద నేనే దరఖాస్తు పెట్టి మిమ్మల్ని మోసగించాల్సి వొచ్చింది" అన్నాడు.

★ ★ ★

# ఎరికలమ్మ

నర్సాలుకి ఆలిస్యమయిందని తొందరగా సైకిలు తొక్కుకొని పోతున్నాను. మధ్యాహ్నం గుంటూరు రైలుస్టేషన్ Refreshment rooms లో టీ కప్పుముందు పెట్టుకుని ఆలోచనలో పడితే యెంత కాలం గడిచిపోతోందోతెలీదు. ఆలస్యంగా వొచ్చానని, చిరునవ్వుతో నా మొహం వంక చూసే సాహెబు హెడ్మాష్టర్ని తలుచుకుంటేనే వొళ్లు కంపరమెత్తుతోంది. కోప్పడే వాళ్ళనీ, నోటీసులు పంపేవాళ్ళనీ, గొణుగుకొనే వాళ్ళనీ, వూరుకునే వాళ్ళనీ భరించవొచ్చునుగాని తప్పు జరిగినప్పుడు చిరునవ్వు నవ్వే డెవిల్‌ని భరించడం కష్టం.

నా Old horse ని spur చేస్తూన్న నేను. చప్పున కళ్ళెం బిగించి ఆపాను. ఆస్పత్రి గోడప్రక్కన ఒక ఆమె నించునివుంది. ఏదో జ్ఞాపకం తళుక్కుమంది మెదడు వెనకాల ఎక్కడో, సైకిల్‌దిగి నిదానించి చూశాను. అందమైన ఆడదాన్ని చూశానా గర్వం హెడ్మాష్టర్లు వెయ్యిమంది, లక్ష చిరునవ్వులునవ్వనీ. నా కేం లక్ష్యం ? "నువ్వా" అన్నాను దగ్గరికి వెడుతో. ఆమె చదువుకున్న ఆడదైతే, ఒకా వొకప్పుడు నేనెంతబాగా ఎరిగిన మనిషైనా చనువుగా పలకరించేముందు సంకోచింతును. చుట్టుపక్కల ఎవరున్నారో ఆమెచూపు యెట్లావుందో, అన్నీ ఆలోచించాలి. కాని ఎరికలదేగా ! "నువ్వా" అనడానికికూడా నాకు కారణంగాని, అధికారంగాని, లేవు. కాని అధికారంలేని  పనులన్నీ మానేసి బతకగలనా, ఈహృదయం నశించిపోదా ? లోకమిచ్చిన అధికారాలు వొదులుకున్నాను. లోకం వొద్దన్న అధికారాలు కావాలని పోట్లాడతాను. అదేగా నా జీవితచరిత్ర. ఆస్పత్రి గోడపక్కన. యెండలో, తాటాకు బుట్టచేతపట్టుకుని నుంచుని వుంది ఆమె.

ఎరగనట్లు, నిదానంగా నావంక చూసింది ఒక నిమిషం. మళ్ళీ ఎక్కడానికి గుర్రాన్ని తట్టుతున్నా. ఇంతలో ఆమె కళ్ళలో జ్ఞాపకం వెలిగింది. జాలిగా దిక్కులేనట్టు చూస్తున్న నల్లని మొహంమీద నవ్వు కమ్మింది అర్ధరాత్రి చంద్రోదయమైనట్టు. నిదానించి ఆలోచించి 'అల్లరిదాన్ని' అన్నది సిగ్గుతో, క్షమించమని కళ్ళు అడిగాయి.

ఆలోపలే, ఆమె కడపట చేసిన అవమానం నాకు జ్ఞాపకంవొచ్చి, సైకిలుదిగి పలకరించినందుకు సిగ్గుపడుతున్నాను.

మోటారులో రోడ్డు వెంట యింజనీరుగారు వెడుతున్నారు. టీపార్టీలో నన్ను కలుసుకొని. ఏ గాలివల్లనో, స్నేహం చేసుకుని. రెండు మూడుసార్లు యింటికి రమ్మన్నారు. అఖరు, యీనాటితో యింక యింజనీరుగారు పెడ మొహం పెడతారు. ఆయన స్నేహానికి నీళ్ళు వొదిలాను ఆ వేడిరోడ్డు పక్కన. ఆస్పత్రి గోడ కింద తాటాకుబుట్ట పట్టుకుని నించున్న యెరికల మనిషితో చనువుగా మాట్లాడేవాడికి క్లబ్బు గతులున్నాయా ?

ఆ ఇంజనీరే అట్లారాకపోతే, నేను సైకిలెక్కి వెళ్ళిపోయే వాణ్నేమో ! ఇంకా యెవరైనా యింజనీర్లు రానీ ? వాళ్ళ తల్లి భార్యల్ని రానీ, చూడనీమని ఆమెకి యింకా దగ్గరగా వెళ్ళేను.

"ఇక్కడికి యెట్లా వొచ్చావు ?"

"ఆవూరూ యీవూరూ తిరుగుతూ."

నే నామెని మొదటిసారీ చివరిసారీ చూసింది ఒక మధ్యాన్నం గంటసేపుపెన్నదగ్గిర.

అది ఏప్రిలు నెల నెల్లూరులో. ఎన్నాళ్ళకీ స్కూలు ముయ్యరు నేనున్న కొత్తయింట్లో స్నానానికి వీల్లేదు, ఏమంటే, పక్కనేగా పెన్న అన్నారు. పక్కనే పెన్న యిసిక ! పెన్ననీరుకాదు. కొవ్వూరు వెళ్లాలి నీటికోసం. కొవ్వూరుదగ్గిర పెన్న చైత్రంలో పధ్నాలుగేళ్ళ పిల్లలా గుంటుంది. కలకలమని పరుగెత్తుతుంది. ఎండలో మెరుస్తుంది. పిచ్చిగా వెచ్చగా వుంటుంది. చన్న చిన్న అలలు మాట్లాడితే మెలికలు తిరుగుతుంది. గంభీరమైన గోదావరి యీతలతో నదీజీవనం ప్రారంభించిన నాకు, యవ్వనవతి కృష్ణలో ఆటలాడి, చివరికి యీ పెన్నతో చిక్కులు పడాల్సి వొచ్చింది. కాలం గడిచినకొద్దీ పెన్నమీదే ప్రేమ ఎక్కువైంది; ఒక పెన్న మీదే కాదు.

కొవ్వూరి వొడ్డున పెన్న అనేక పాయలు. పాయల మధ్య చిన్న చిన్న యిసిక లంకలు. పగటి వెంద వేడి అంతా పోయేట్టు వోపికగల మనుషులు రెండు మైళ్లూ నడిచి వొచ్చి, తలోక పాయనీ కావిలించుకొని పడుకుంటారు. రెండుచేతులూ చాపితే పాయ అంతా రొమ్ముకింద యిముడ్తుంది. పెన్న అలలు వీపు చుట్టూ అందుకోలేవు. తాపం పోవడానికని ఆ పాయ మీద ఇటూ అటూ దొర్లుతారు రసికులు. అందులో ప్రత్యేకం ఒక నీలపు పాయను నేను అధీనంలో ఉంచుకున్నాను. నా కన్న పెందరాళే యెవడన్నా దాన్ని

అక్రమించుకున్నాడా మండిపడతాను. కాని ఆ పాయ మీద నాకేమి అధికారముంది ? ఆ పాయకిష్టమై ఆ మనిషి కిష్టమైతే నాకెందుకుని యింకో పాయకి పోతాను. కాని ఆనందంలేక, తిరిగి వొచ్చీ ఆపాయనే పంచుకుంటాను. రెండో వాడితో. నా అంతటి వివేకమే అందరికీ వుంటే యెంత బావుంటుంది లోకం ?

ఆరోజు సాయంత్రం నది మొదటి పాయ వొడ్ను యిద్దరు కనపడ్డారు, ఓ కుర్రాడు కుర్రదీ. కుర్రాడు యెక్కువ నలుపు. ఆమె చిరిగి పోయిన బట్టముక్క విడిచి అంతకన్న పేలికలుగావున్న వస్త్రం ధరిస్తోంది షోకుగా. ఎంతలాగినా బుజంమీద రెండో కొన నిలువదు పొడుగు; ఎంత పరిచినా రెమ్ము రెండుచివర్లనీకప్పదు, వెడల్పు. నవ్వాలో దుఃఖించాలో తోచలేదు.

అతను యానాదిమనిషి చూపుపెట్టి లోకంతో సంబంధంలేనట్టు నుంచున్నాడు. నన్ను ఆమెచూసింది. విడిచినబట్టని తీసుకొని నదిలో దిగింది. అతను ఒడ్డున యిసికమీద కూచున్నాడు. ఉతకడానికి వొంగేటప్పటికి ఆచిన్న పమిట కిందికిపడ్డది. నావంక చూసింది. పకపకా నవ్వింది. ఆ నవ్వుకి నాలుగిందాల అర్థం కనపడ్డది, నానార్థాలు బోధించే వుపాధ్యాయుణ్ణి కనక గాబోలు లాభంలేదని ఒదిలేసి బట్టవుతుకుతోంది. నాకు ఆమె శరీరాన్ని చూడ్డం చాలాసుఖంగావుంది. ఆమెకేమీ లక్ష్యం లేదు. ఆ మొదటిచూపు తరవాత ఆమెనన్నే మరిచిపోయినట్టుంది. నేనుంచున్నా వొకటే కుక్క నుంచున్నావొకటే ఆమెకి. బుద్ధిలో కూడా బేదమాటే లేదనిపించింది నాకు. అందువల్లనే నేనీ కథ వ్రాయడమూ నా సోదరులు చదివి ఆనందించడమూ కలిగాయి అనుకోండి.

చక్కని ముక్కు పల్చనీ ఎడమ చంప మీద సూర్యుడు నిగ నిగ మంటున్నాడు. నాకు కనబడే యెడమరొమ్ము యెడమప్రక్క చర్మం సాగడం మూలంగా తెల్లగా ఉంది, ఆ నీళ్ళలో తలయెత్తే చిన్నయిసిక తిన్నెవలె.

నేను చెప్పులు విడిచి, నాపాయని చేరుకుని, పడుకున్నాను నా శరీరం నీళ్ళలో-నాకళ్ళు ఆకుర్రదానిమీద, పెన్నకాగా సహించింది. గోదావరైతే ఒక్కతన్ను తన్ని ఒడ్డుమీద పారేసును. లేకపోతే ఒక్క మునక ముంచి, ఇంక చూపులు లేకుండా చేసును.

బట్ట ఒడ్డున ఆరేసింది. నీళ్ళలోదిగింది. అతనూ దిగాడు. వెల్లికితలా పడుకుని, ప్రక్కన కూర్చున్న అతనిమీద నోటిలోనుండి నీళ్ళు చిమ్ముతోంది. చేపవలె కొట్టుకొని, అతని కాలు లాగుతుంది. గిలాగిలా కొట్టుకుని, జారి, పైకి లాక్కోమని చెయ్యి అందిస్తుంది.నవ్వుతుంది. అరుస్తుంది. అతన్ని

చరుస్తుంది, రెచ్చకొడుతుంది దూరంగా పాకుతుంది. పిల్లిలాగు పొంచి దూకుతుంది. ఇసికి ముద్దలతో కొట్టింది. గులకలు విసిరింది.అ తను కదలడు. అట్లా ఆనందంగా చూస్తూకూచుంటాడు కళ్ళు ఆమెకి వప్పచెప్పి ఏమిటి గోల అని చిన్న పిల్లవంక చూశేట్టు చూస్తాడు. మళ్ళీ ఆమెకన్న వయస్సులో చిన్నవాడుగా కనిపిస్తాడు. శరీరం అంత చిన్నదిగా వున్నా ఆమె మొహంలో పాతికి ఏళ్లున్నట్లు కనపడ్డాయి. ఆ అల్లరేమీ అతని కిష్టంలేదనీ ఆమెమీద ప్రేమచేత భరిస్తున్నాడనీ అనిపించింది నాకు.

మా కుక్కలు జాన్, జిమ్మీ జ్ఞాపకం వొచ్చాయి. జిమ్మీ ఆటలమారి జాన్ని పీకి, కొరికి ఆడుకోమని అరిచి, ఇటూ అటూ దూకి గోల చేసింది. జిమ్మీమీది ప్రేమవల్ల జాన్ కదలక నుంచునేవాడు, అరవక, కరవక, (అవునా కాదా వాణీ !)

అల్లరంతా కానిచ్చి, మెల్లిగా ఆమెని పడుకోపెట్టి ఇసికతో ఒళ్ళంతా రుద్దుతున్నాడు. చిరునవ్వుతో అతని మొహం వంక చూస్తో, రాణీలాగు పడుకుంది. రాణీల పడకలు ఆ యిసికకన్నా ఖరీదు గలవేగాని సౌఖ్యం కలవా ? వాళ్ళిద్దరి తన్మయత్వాన్నీ చూసి నేను తీవ్రంగా యీర్ష్యపడ్డాను. బ్రతుకు అట్లా ప్రేమలో లీనమై, నన్ను నేనే మరిచిపోగలిగితే ! ఈ చదువులూ, పరీక్షలూ, వరండాలూ, భోజనాలూ, నగలూ, పుస్తకాలూ, కార్లూ, ఇన్స్పెక్టర్లూ, కుర్చీలూ, హెడ్మాస్టర్లూ-

అది ప్రేమేనా ? కవులుపాడే ప్రేమ అదేనా ? అనుకున్నాను. వాళ్ళకా కామమూ లేదు. పశుత్వమూ లేదు ఆ నిమిషాన. ఆమెది నన్నని వొళ్ళు, ఒక్క తులం కొవ్వులేదు యెక్కడా, యెట్లా వొంచితే అట్లా వొంగేట్టు యెట్లా చాచితే అట్లా సాగేట్టు కనబడుతోంది. జింక వలె యెగురుతుంది. ఇటూ అటూ అడి అతని మొహం వంకచూసి "ఊ" అని కంఠంలోంచి ధ్వనిచేస్తే 'గ్రైటాగార్బో' యీమెనించే నేర్చుకుందా అనిపించింది. ప్రేమ ఎవరికన్నా ముఖంలో కంఠంలో మాధుర్యం తెప్పిస్తుందికదా ! చివరికి వేసవికాలంలో బనారసు చీరెకింద, వంటింటి పక్కగదిలో, పందిరిపట్టె మంచంమీద, చెవులో బంద గోపికలపటం కింద గర్భాదానం జరిగే చిలిమిడి ముద్ద కన్యకి కూడా-చివరికి.

గొప్ప అభిప్రాయాలూ, ఆత్మలు కలవడాలూ, మనోభావాల ఐక్యం పాతివ్రత్యం ఇవేమీలేనేలేవు. అట్లాంటి నాన్సెన్సేలేదు. ఇద్దరి మధ్యా యవ్వనమూ, ఆరోగ్యమూ, యిష్టమూ, యింకేం కావాలి ? నిన్నలేదు. రేపులేదు. ఆస్తిలేదు. హక్కులేదు. అనందమంటే వాళ్ళది.

ప్రియురాలి కళ్ళలోకి చూస్తూ ఆత్మవున్నదాలేదా, అని యోచించే వాకు ఆనందమేమిటి, ఈ లోకంలో.

తోకలేని కొంగ చేపల కోసం దేవుళ్ళాడుతోంది. సూర్యకిరణాలతో మెరుస్తూ లేత అలలు యిసికమీద ఆడుకుంటున్నాయి. ఆనకట్ట చివర ఒకడు పడిపోయినట్టు ఏమి బావుకుందామనో సైకిలెక్కి పోతున్నాడు వేగంగా. అధికారి ఎవడో తన దర్జాకీ అదృష్టానికీ పొంగుతో మోటారులో ఊరేగు తున్నాడు తనిఖీలకి. ఆ నల్లనిపిల్ల వీపుని నల్లనివాడు రుద్దుతున్నాడు యిసికతో. పిల్లలిద్దరూ ఆడుకుంటున్నారు పెన్నవొడ్డున.

ఆమె రొమ్ము రుద్దాడు. తొడలు రుద్దాడు. నేను చూస్తున్నా ఆమె కూడా తలయెత్తి చూడలేదు. అతని కళ్ళల్లో కించిత్ మార్పులేదు. నేను ఆమెస్త్రీ అని మరిచిపోయాను. అతనూ మరిచాడు. మొగుడూ పెళ్ళామేనా ఎంతకాలం వుంటుంది ఈ ప్రేమ, వాడింకేం చేస్తాడు. ఇల్లాంటి పవిత్ర ప్రశ్నలేమీ తట్టలేదు. అద్భుతమైన కవిత్వం చదువుతున్నట్టుంది. కదలకండానే అట్లా పడుకున్నాను తన్మయుణ్ణయి. వాళ్ళ ఆనందంలో నాస్తితిని నా వునికిని నేనే మరిచి !

మెల్లిగా యెంకిపాటలు జ్ఞాపకం వొచ్చాయి. పాపం, సుబ్బారావు గారినీ అట్లానే అన్నారు. ఆయన 'ఎంకి'కి పెట్టిన భావాలు అసహజం అంట చదువుకున్న వారికిగాని ఆ ఆలోచనలు వుండవుట. పుస్తకాల్లోంచి మాత్రమే జ్ఞానమూ, వేదాంతమూ, రసికత్వమూ, తెలుసుకోడం బాగా అలవాటే ఆ పుస్తకాలు చదవనివాళ్ళకి ఆ జ్ఞానమే రసికత్వమే వుండదని వాళ్ళ అభిప్రాయం. చదవనివాళ్ళకి వున్నాయో లేదోగాని, ఈ చదివిన వాళ్ళని నే నెరుగుదును. పుస్తకాల్లో, నాటకాల్లో, సినిమాల్లో తప్ప దేవుణ్ణిగాని స్త్రీనిగాని, బిడ్డనుగాని గొడ్డునుగాని. ప్రేమించే శక్తి పూర్తిగా నశించింది. వీరిజ్ఞానమంతా ప్రేమించిన ఇంకోడు బొమ్మలువేసి చూపవలసిందే. తోటలో ఒక గంటసేపు రమ్యంగా తిరగలేరు. ఆ తోట ఆందం అట ఫొటో యెత్తితేగాని, కనపడదు. రోజూ సూర్యోదయ సూర్యాస్తమానాలు అద్భుతంగా నెత్తిమీద జరుగుతూ వుంటే కళ్ళు మూసుకుని; సినిమాలో సూర్యోదయం చూపితే అరనిమిషం వూపిరి బిగపట్టి ఆనందిస్తారు. ఈ యిద్దరివంటి ప్రియులు ఆడుకోంటో వుంటే కసిరి అవతలకిపోయే చాందసులును, సులోచన వెయ్యిమాట్లు స్టడీచేసి ఫొటో తీయించుకున్న చూపును పావలా పెట్టి కొని చప్పరిస్తారు. మొగవాడు స్నానం నరసింహరావు 'హా కృష్ణా' అని వెనిక్కి విరుచుకుంటే యీ పురుషులందరూ, 'హా' యని ముందుకు వొంగుతారు.

నేను తుడుచుకుని, పాయలు దాటి వొచ్చేటప్పటికి ఆమె స్నానమై ఆరినబట్ట కట్టుకుని, తన బట్ట వుతుక్కుంటున్న అతనితో ఏదో చెప్తే నవ్వుతోంది. వాళ్ళ దగ్గిర నేను విడిచి వెళ్ళిన చెప్పుల వంక చూసి నవ్వుతున్న ట్టుంది. చెప్పులు చక్కనివే. నవ్వెందుకు ? ఇట్లా అనుకున్నాను.

"ఆయన వొచ్చేలోపున ఈ చెప్పులు తొడుక్కుని నువ్వు పరుగెత్తు" నీ గోచీతోసహా. ఆ గోచీ, ఈ చెప్పులు ఎట్లా వుంటావు రాజకుమారుడిలాగ! హ హ హ ఆయనేం చేస్తాడు. ఆ తడిలాగుతో నీ వెంట పడతాడు. పడనీ, ఆ సంచీ యెత్తుకుని నేనిట్టాపరుగెత్తుతా? ఏంచేస్తాడేం ? ఎవరూ లేరులే చెప్పుల్ని ఆ డొంకలో విడిచి నువ్వుపో. సంచీ ఆ గట్టుమీద పారేసి నేవొస్తా." అంటోందేమో !

నేను వాళ్ళ దగ్గరగా వొచ్చి, చూస్తో నించున్నాను. అతను బట్ట వుతుకుతున్నంతసేపూ ఆడింది. నవ్వింది. గంతులేసింది. పాడింది. నాకు వొకమాటా అర్థంకాలేదు. ఒక్కొక్క పోజ్ ఎంతో అందమనిపించింది నాకు ! ఎక్కణ్ణించి వొస్తోంది. ఆ సంతోషం ఆ కవిత్వం, ఆ మధురమైన వొయ్యారం ! అతను తడిబట్ట పిండుకుంటున్నాడు. ఇద్దరూ వూరివేపు ప్రయాణమైనారు. ఆమె వెనక్కి తగ్గింది. నా వంక తిరిగి చూస్తోంది దొంగతనంగా! వాళ్ళనే యింకా చూస్తూన్నట్లు కనపడడం సిగ్గేసింది నాకు. ఆమె కిందికి వంగి ఏదో యేరుకున్నట్టు కనబడి, నా వంక చూసింది. నేను నదివేపు తిరిగాను. పెళ్ళుమని నా వీపున ఇసిక పెళ్ళ పగిలింది. వెనక్కి తిరిగాను. నవ్వులో పరుగెత్తుతోంది ప్రియుణ్ణి కలుసుకోడానికి. కోప్పడ్డానికీ, అరవడానికీ కూడా దూరంగా వున్నారు వాళ్లు.

ఆమె వుద్దేశం ఏమిటి ? కోపమా, ఇష్టమా, అల్లరా ? పోనీ ఆ గోల ఎందుకు ? మళ్ళీ కనపడతారా యామన్నానా ? అనుకుని బైలుదేరాను. నా తోవ వాళ్ళ వెనకనే. శలవలకి మర్నాడు వూరికి పోతున్నాను పెన్నకి గుడ్‌బై.

వాళ్ళకేసి చూశాను. దూరంగా ఆ యిసిక మైదానంలో ఆ పంచని చెరో చెంగూ పట్టుకుని ఆరేసుకుంటో పోతున్నారు. ఒక చెంగు స్తంభానికి కట్టినట్లుంది. రెండో చెంగు తూలుతుంది. వొంగుతుంది. ఎగుర్తుంది వూరి కిందపడుతుంది.

అదీ ఆమెని నేను చూచిన ఆనాటి సంగతి.

అగి పెన్నవంక చూశాను. శలవు. చిన్న అందాలూ; ముద్దు ముద్దు శబ్దాలూ, చాతగాని వేళ్ళతో కౌగిలింతలూ, పిట్టవంటిముద్దులూ, అన్నీ మళ్ళీ

నేను వొచ్చేటప్పటికి పెద్దదవుతుంది. కాళీ రూపం దాలుస్తుంది. ప్రచండ మారుతంతో వరదలు విసిరికొడుతో వుంటాయి. తన తోవదాటే నరుల్ని పెద్దనాలుకలు చాచి కబళించి మింగేస్తోవుంటుంది. విడవలేక మెల్లిగా ఆనకట్టవేపు వెళ్ళేను. ఆనకట్టకింద మడి రేవుతో మేము స్నానం చేసిన నీళ్ళు చేరుకునే గుంటలో, పారుదలే లేని ఆ మురికిలో, ముసలమ్మలు చెంబులు తోముతున్నారు. శ్రోత్రియులు మంత్రాలు చదివి స్నానం చేస్తున్నారు. ఈనాడు పావనమయింది మీ జన్మ ! ఆమె పీపు కడిగిన నీళ్ళు ఆచమనం చేస్తున్నారు. స్వర్గం కావాలా? మీకు ? ఎక్కడ వుంది స్వర్గం నల్లని పీపు తోమే భాగ్యంలేనిమీకు స్వర్గం ఏమిటి ? మోక్షమా ఈ మడినించి ఈ చాదస్తంనించి ఈ మురికి నీళ్ళనించి ఈస్వార్థంనించి, ఈ నీతినించి ఎన్నటికి మీకు మోక్షం ? చల్లని గాలిలో, తెల్లని యిసికతో, పల్చని నీళ్ళలో కలిపి, పీపు రుద్దలేని మోక్షాలెందుకు ?

సూర్యుడస్తమిస్తున్నాడు. ఎర్రగా, ఒక మబ్బులేక, గంధం కడిగిన సింహాచల నరసింహస్వామివలె దర్శనమిచ్చాడు. నాలుగు నిమిషాలు, ఆనకట్టమీద పొయ్యే బళ్ళు, గొడ్లు, మనుషులు. ఆకాశం తెరమీద 'సిలట్టీ' లుగా కనబడుతున్నారు. ప్రతి దేహాన్నీ ప్రేమతో కావలించుకుంటోంది దక్షిణపు గాలి. ఆ యేటి మైదానమంతా కలిపితే యిరవైమంది లేరు. ఏం చేస్తోంది నెల్లూరు, వేలకొలది ప్రజలు ! కాఫీ హోటళ్ళలో, క్లబ్బుల్లో, సినీమాలలో గుమికూడారు. మూడు రూపాయలకి రాత్రంతా లభించే బుజంలో సగం, గాలికి బహిరంగమైనట్టు, అరనిమిషం ఫోటో తీస్తే దాన్ని చూసి తృప్తి పడడానికి- ఈ వేసవి కాలంలో మూడు వందలమంది ఒకరి గాలి ఒకరు పీలుస్తో రేకులకింద చేరారు. కూర డబ్బులు గేటు దగ్గర వాళ్ళ కిచ్చుకుని, ఈ పెన్నానదిని వొదిలి 'రాణీ ప్రమీల'ను చూస్తున్నారు.

ఇదీ పాత కథ.

ఆనాడు ఆమె యిసిక పెళ్ళ విసిరిన సంగతి జ్ఞాపకంవొచ్చి పైకి లెక్కబోతో 'అతనేడీ'? అన్నాను.

ఆస్పత్రివేపు తల వూయించింది కళ్ళలో నీళ్ళు నిండాయి.

"జబ్బా !"

తలవూయించింది. "పాపం" అన్నాను. ఇంకే మనను ?

"ఎన్నాళ్ళుంటారు ?"

చప్పున ఏడ్చింది.

"అయిపోయిందాకా."

నవ్వులతో భూమినీ ఆకాశాన్నీ నింపిన పిల్ల ఈనాడు నాముందు యేడవడం సహించలేక పోయినాను బుజంమీద చెయ్యేశాను. అవును రోడ్డుమీదనే ! నాకా యీ నాడు పోయేందుకు కేమీ మర్యాదలేదు. ఇక ఆమె-నగలులేవు చీరెలులేవు ఆమెకేం మర్యాద !

"డాక్టరు కుదరదన్నాడా ? నేను వచ్చి డాక్టరుతో మాట్లాడనా ?"

"పదిరూపాయలు కావాలిట."

"ఎవరికి ?"

"డాక్టరికి. మందుకొని యెక్కించాలిట."

కొంగు కళ్ళకి అడ్డం పెట్టుకుని ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడ్చింది. ఆ కదిలే రొమ్ము మీదికి వెళ్ళాయి నాకళ్ళు, చీరె యిదివరకంత చిరుగులు గాలేదు కాని కొంగు కళ్ళదగ్గరికి లాక్కుంటే రొమ్ము పూర్తిగా కప్పేటంత విశాలమయినది కాదు. ఆంధ్రపవిత్ర నారీమణులవలె యెనిమిది గజాలు కొనలేరు పాపం ఈ బీదవారు.

"పెన్న దగ్గరకన్న కొంచెం అందం యెక్కువయింది కాని తగ్గలేదు" అనుకున్నాను, సిగ్గులేక. ఎంతప్రయత్నించినా ఆగవు ఈ చూపులూ, ఈ కోర్కెలూ, పుటకతో వచ్చాయి. "సాయంత్రం మా యింటికి రా-"

ఆ మాటలు నేను అనడానికి కారణమేమిటి ? ఆ రొమ్ము మీద కలిగిన ఆనందమూ, ఆ రొమ్ములో కలిగిన దుఃఖమా ? రెండూనేమో మానవ స్వభావం అగాధమయినది.

సైకిలెక్కి వెడుతున్నాను. "ఇల్లెక్కడ" అన్నది. దిగి. చీటీవ్రాసి యిచ్చాను. ఆమె వంకచూసి, "తప్పకరా" అన్నాను స్కూలులో జాగ్రఫీ చెపుతున్నాను; పిల్లల్ని తిట్టుతున్నాను. మేస్టర్లతో సణుగుతున్నాను. అదే ఆలోచన, కళ్ళముందు ఆమెదే రూపం. పదిరూపాయలు ! బీదవాణ్ణి, మరదలు పెళ్ళి అవుతోవుంటే మొన్న కట్నానికి డబ్బులేదు పొమ్మన్నాను, మామ నాకు జరపని లాంఛనాల సంగతి దెప్పిపొడిచి. ఆ పది రూపాయలతో ఆగుతుందో, మెల్లిగా, ఇంకా-లాగుతుందో ?

ఆమె అడగలేదన్న సంగతి మరిచిపోయినాను.

పదిరూపాయలు ! రెండురోజుల జీతం. ఏమిటిలాభం నాకు ? ఈ లోకంలో ఓ ఎరికిలాడు చస్తేనేం బతికితేనేం ? ఆమెకోసమా! ఏమిస్తుంది? ఇస్తే ! తీరా యియ్యకపోతే ! అతనిమీద ప్రేమ సంగతి ఏంచేస్తాం ?- కాని ప్రేమవుంటేనేం, ఎంతమందో !

"ముందే కండిషన్ పెట్టు" అంది ఒక చిన్న డెవిల్ నా చెవిలో.

"వీలైతే చూస్తాను" అన్నాను డెవిల్‌తో.

డాక్టర్ దగ్గిరికి వెళ్ళి కనుక్కొని ఆమె కథ అబద్ధం కాదని రూఢి చేసుకున్నాను. నా జాగ్రత్తకి నేనే సంతోషించాను. పూర్వం స్త్రీ కన్నీరు చూస్తేచాలు 'ఏంకావాలి, నామానమా ప్రాణమా ? ధనమా, కాలమా ?' అనేవాణ్ణి, ఆప్రకారం స్త్రీల క్షణికమైన whims కి బలిఅయి, మోసపోయి సిగ్గుపడి; కొంచెం ప్రూడెన్సు పాఠాన్ని నేర్చుకున్నాను.

నేను ఇంటికి వెళ్ళేటప్పటికే ఆమె అరుగుమీద కూర్చునివుంది. ఆమెనిచూసి, దిక్కులేనట్టు అట్లాపడివుండడమూ; బిచ్చగత్తెవలె వీధిమీద కూర్చోడమూ, రేగినజుట్టూ, ఆ ముతక చీరా, చూసి, మధ్యాహ్నం అంతచనువుగా ఎట్లామాట్లాడేనా అనిపించింది. మర్యాద, ఆచారమూ ఇవిచుట్టూగాలిలో ప్రాణవాయువువలె కలిసి కాచుకుని వుంటాయి. రోజూ మనస్సుని అవి వదిలిపోయేట్టు తోచకపోతే, రాగిపాత్రవలె Poisonous compounds form అవుతాయి.

లోపల కోటు తగిలిస్తోవుంటే ధర్మపత్ని 'ఎవతో కొత్తదివచ్చి కూచుంది వాకిట్లో,' అంది నవ్వుతో. నేను మర్యాదగా తక్కినభర్తల వలె బ్రతుకుతానని కీర్తి సంపాదిస్తాననే ఆశకి యెప్పుడో నీళ్ళు వదులుకుంది. డబ్బున్నా కొంచెం జాగ్రత్తపడతానేమో యెన్నటికన్నా అని ఆశ యింకా పోలేదు. ఆమె చూడకండా పదిరూపాయల నోటు జేబులో పెట్టుకుంటూవుంటే, ప్రొద్దున్న ఆమె బీరకాయలు అరవీశ, రెండు కానీల దమ్మిడీకి బేరమాడడం జ్ఞాపకం వచ్చింది. ఎప్పటికో కాసులపేరు చేయించుకుందామని ఆమె ఆశ.

అరుగుకింద నిద్రపోతున్న కుక్క మీదనించి పిల్లలు లాంగ్‌జంప్ చేస్తున్నారు. ఎదిరింటి కప్పుమీద కాకులు వరసగా కూర్చున్నాయి. కొబ్బరి చెట్టు ఆకు చివర్లు ఎండలో మెరుస్తున్నాయి. ఆమెలేచి నించుంది. నా ఆలోచన అంతా బేరం ఎట్లా 'గ్రేస్‌ఫుల్'గా చేద్దామా అని. ఆమె కళ్ళలోని ఆశని భరించలేక, ముఖం తిప్పుకుని, విసురుగా 'ఇక్కడ వీల్లేదు. ఆస్పత్రి దగ్గరవుండు వస్తాను' అన్నాను కఠినంగా. ఇట్లా తిట్టడం కూడా ఒకందుకు మంచిదే ననిపించింది. హృదయంలోని కోర్కెకి ఎన్ని చిక్కులు పెట్టింది. అసహ్యమైన మాటలు, ఫీలింగ్సు, రేపింది ! నావంక బిక్క మొహంతో చూసి 'నిజమేనా ?' అంది.

"నిజం, వెళ్ళు."

కాళ్ళీడ్చుకుంటూ వచ్చినదోవనే పోతూంది. నేను సైకిలుమీద క్లబ్బుకి వెళ్ళి, లైమ్‌జూస్ అనే పేరుతో అణాతీసుకొని వాళ్ళిచ్చే వేపాకు రసం తాగి ఆంధ్రపత్రికలో, ఆ ప్రముఖులు దేశానికిచ్చే తెలివైన సలహాలను చదివి ఆనందించి, అస్పత్రి గోడ దగ్గిరికి చేరుకున్నాను. దీపాలు వెలిగిస్తూ వెడుతున్నాడు నిచ్చెనమనిషి. గొప్పవారిపేరు, గొప్ప గొప్ప గోతులు కల రోడ్ల దుమ్ములోనుంచి తప్పించుకొని కందకం ప్రక్కన నిలుచున్న ఆమెని చేరుకున్నాను. బేరానికై హృదయాన్ని గట్టిచేసుకున్నాను. మరి నా హృదయంలో మధ్యాహ్నంనుండి పేరుకున్న మర్యాద మహాత్మ్యమో లేక ఏపనినైనా అనుమానాస్పదంగా-చేసేగుణం ఆ చీకట్లోనే వుందో, ఆమెతో మాట్లాడడమంటే ఆమెతో కలిసి నిలుచోడమంటే సిగ్గుపడుతున్నాను. రాగిచెంబు చిలుముపట్టింది.

"తీసుకొచ్చారా?" సంతోషంతో ఆతురతతో ఆమె నల్లని పెదవులు వణుకుతున్నాయి. చెయ్యి కొంచెం చాచింది.

రాత్రికాగానే ఆడవాళ్ళలో అందంకూడా ఎక్కువగా కనబడుతుంది. అందులో ముఖ్యం నల్లనివాళ్ళది. దుమ్మూ ధూళీ కనబడవు.

తెనాలి రైలు కూత కూసింది. ఆమె దగ్గిరగా జరిగాను.

"ఇస్తాను నాకేమిస్తావు" అనేశాను. ఆ చీకట్లోనే ఆమెకర్థమైనట్లు తోచింది. 'మామూలేనేమో' అని సిగ్గుకి జవాబు చెప్పుకున్నాను. కాని మామూలైన మనిషేనా ! అని నా డబ్బు విలవ కూడా తగ్గి బాధపడ్డాను.

చాలసేపు మాట్లాడలేదు. తర్వాత 'సరే' అంది.

ఆ 'సరే' అనే ఒక మాట నా హృదయంలోనుంచి దూసుకుపోయింది. నన్ను తిట్టినా, సిగ్గుపడ్డా, "అల్లాంటిదాన్ని కాను."

"అన్నా, ఇది ధర్మమా?"

"నీ డబ్బు దాచుకో" అన్నా భరించి ఉందును. కాని, ఆ 'సరే' నన్ను బాధించింది. నిశ్చయం, నిరాశ, తృణీకారం; నిస్సహాయం ఎన్నో స్ఫురించి కలవరపరిచాయి. నోటు చేతులోపెట్టాను. చేతిని గట్టిగా పట్టుకుంది. 'అక్కర్లేదులే' అనాలనినింపింది. దానికికూడా ధైర్యం రాలేదు. తల వంచుకొని ఆ రోడ్డుదుమ్ముకన్నా అధమంగా ఫీలవుతూ పోయాను. ముహూర్తనిశ్చయం చెయ్యడానికన్నా ధైర్యం లేకపోయింది.

మూడురోజుల తరవాత కాఫీహోటలునుండి నేనూ, దీక్షితులు గారూ; సుబ్బారావూ వస్తున్నాము. నా తలనొప్పి కుదురుస్తానని దీక్షితులు గారు

సూర్య నమస్కారాలు చేయిస్తున్నారు. రెండు పూటలా భోజనం తప్ప పనికిరాదని శాసించారు. ఆ వంకపెట్టి నన్ను యెదురుగా కూచో పెట్టుకొని యిద్దరూ నవ్వుతూ హాయిగా తింటున్నారు. బిక్క మొగంతో నేను వెంటనడుస్తున్నాను. సుబ్బారావుకి చాలా సంతోషంగా వుంది నా పత్యం.

తటాలున ఆస్పత్రి గోడవెనకనించి ఆమె వచ్చి నా చేతులు పట్టుకుంది. కళ్ళంబడి నీళ్ళు చెంపలమీదికివచ్చి రోడ్డుదుమ్ముని కరిగిస్తున్నాయి.

"నెమ్మదిగావుంది. అన్నంతిన్నాడు" అంది చాలా ఉత్సాహంతో. కళ్ళు నిగ నిగ మన్నాయి యెండలో. ఇంకా నలుగురు పోగైనారు. సిగ్గుతో, తత్తరపడి 'సరే, సరే' అని నడిచి వెళ్ళిపోయాను. వెనక్కి చూసేప్పటికి ఆమె 'ఇదేమిటా? నేనేం చేశాను. కోపం తెప్పించడానికి ?' అన్నట్టు చూస్తోంది. విద్య, మా స్నేహితులు, పేరు ప్రతిష్టలు ఆ ఇబ్బందులు ఎరగదు అనుకొని, క్లాసులో ప్రవేశించి, పదిమందికి ఇంపోజిషన్ యిచ్చాను.

రాత్రి రామాయణం చదువుతున్నాను. నావత్నీ విస్తరాకు పారెయ్యడానికి వెళ్ళి, 'అదెదో మళ్ళావచ్చిందండి' అంది. బైటికి వెళ్ళాను. వచ్చి చప్పున నా కాళ్లు పట్టుకుంది. రోడ్డు దుమ్ములో మోకరించి, అహల్యవలె. "మీకు కోపం తెప్పించాను. ఎట్లానో నన్ను కనికరించాలి."

ఆమె బుజాలక్రింద చేతులువేసి లేవనెత్తడం బాగాఉంది. కాని ఇంటి కెదురుగా మునిసిపాలిటీ వారితో పోట్లాడి లాంతరుస్తంభం వేయించుకున్న అవివేకాన్ని తిట్టుకున్నాను. స్వార్థం కసితీర్చుకోక వదలదు.

"నాకేమీ కోపంలేదు. పదిమందిలో మాట్లాడలేకపోయాను అంతే."

రోడ్డు యీ చివరా, ఆ చివరా, యెదురింటి తలుపూ కనిపెడుతున్నాయి నాకళ్ళు. నా చెంపలమీద చేతులు వేసి, 'ఎప్పుడు ?' అంది.

"ఈ రాత్రి పదకొండింటికి, యిక్కడే నిలుచుని ఉంటాను."

ఆమెకీ యిష్టమే ! దొంగ ! ఎట్లా దాచిందో ! నాకేదో ఉపకారం చేస్తున్నట్టు నటించింది. ప్రేమించింది నన్ను. డ్రెస్, ముఖంలో చదువుకున్న కళ. ఎట్లానన్నా ఆ జాతివాళ్ళని ఆకర్షించి తీరతాయి. తరవాత వాణ్ణి వొదలి నా వెంట పడదుకద ! ఎట్లా వొదలించుకోడం ? ఆహా, ఎంత ఆతురత ! తనకితానే అడిగిందే ! ఒద్దులే అని నేనంటే, యేమనేదో! తమాషా చెయ్యవలసింది ! ఎట్లానన్నా నా జన్మే వేరు నన్ను వాంఛించని స్త్రీహృదయం ఉంటుందా ? ఇది యీ పాడు హిందూదేశమై పోయింది కాని, యింకో

దేశమేఐతే, 'నెవారో' వలె అని కలల్లో పడ్డాను. అన్ని వైపులా నేనే. నా ప్రయోజనకత్వమే పదకొండింటిదాకా.

వొచ్చింది. తలుపు తీసి అరుగుమీద గదిలోకి చప్పుడు కాకుండా తీసుకెళ్ళాను. వెళ్ళగానే నా రొమ్ముకి అద్దుకున్నాను. తలలో తెల్లని పువ్వులు, చీరె వుతికినట్లు కొత్తనీటివాసన, ఇనుమువంటిదేహం కాని; యింకా నా 'స్క్రూపుల్సు' పోలేదు. అదిగాక ఆ మొదటివలె వాంఛలేదు.

"నీ కిష్టమేనా ?"

"పోనిద్దురూ."

"వొదిలేవాణ్ణేమో. "కాని మీకూ...." అంది. ఎందుకు అన్నదో."

"నాకు చాలా కావాలి."

"ఐతే సరి."

చాప పరిచాను. ఆమెని ఆచాపమీద ఆ బూజుమూల పడుకోమనడం నాకు సిగ్గేసింది. పెన్న యిసికలు జ్ఞాపకమొచ్చి నిట్టూర్పు విడిచాను. ఈ గుంటూరులో ఆ ఆశలులేవు. నదిలేని ఊళ్ళో ఎందుకు బతుకుతారో మనుష్యులూ, దేశభక్తులూ, శారదారణ్యులూ !

ఆమె చిరుగులబట్టని దూరంగా పెట్టించాను. రోడ్డుదీపం వెలుతురు పడుతోంది. కాని కిటికీ ముయ్యవలసి వచ్చింది.. చీకట్లో నవ్వే ఆమెపళ్లు తెల్లగా కనపడ్డాయి.

"ఏమిటి ?"

"ఏం లేదు."

ఏదో నన్ను వెక్కిరిస్తున్నట్లు తోచింది కాని నేను ఆలోచించలేదు. ఆమె బట్టలే లేకుండా నిలుచుంటే చూస్తున్నాను. నేనాశపర్డ ఆనందం యేమీలేదు హృదయంలో తెచ్చుకోవాలని ప్రయత్నించాను. ఆమెవంక చూశాను ఆతురతతో. చందనపు బొమ్మవలె, శిలావిగ్రహంవలె, నిలుచునివుంది. అంత చక్కని వొళ్ళు హంపీలో విగ్రహానికి చూసినట్లు జ్ఞాపకం. కాని ఆనందమేమీ కలుగలేదు.

"రా" నా పట్టుదలా 'క్యూరియాసిటీ' పని చేస్తున్నాయి కొన్ని కన్నా, ఆమెవొంట్లో మెత్తనిస్థలమన్న మాటలేదు. నాకు కొత్తగా వుంది.

లేచి చిరిగిన చీరెని తీసుకొని కట్టుకుంటుంది. కొంచెంగా కిటికీ తెరిచాను ఊపిరికోసం.

"మరి యింక నేను వెళ్లనా ?"

ఏమీ సంతోషమివ్వని ఆ పని యెందుకు చేశానా అని అసహ్య పడుతున్నాను. నాకేమీ సౌఖ్యమివ్వక డబ్బు కాజేసినందుకు వేశ్యమీదవలె కోపంగాఉంది ఆమె మీద, కావలిసే మోసంచేసింది, నామీద కసిచేత. లేచికోపంతో ఆమె మొగంమీద చెయ్యేశాను. ఆమెనవ్వుతున్నట్లుంది.

"ఎందుకు ?" నా అంతరాత్మ 'గిల్టీ'గా ఉంది.

"ఏమీలేదు." అన్నది.

"చెప్పాలి తప్పదు."

"పోనిద్దురూ."

"కాదు ఒట్టు."

"ఏమీలేదు. ఈ మాత్రానికేనా అంతకోర్కె."

సీత సిగ్గుని దాచిన భూదేవి, బద్ధలై నన్నూ లోపలికి తీసుకోకూడదా? అంతకన్న అవమానంవుందా మొగవాడన్న వాడికి ? నిజమే. నిజమే ? అన్నదా ఆ మాట ! ఆ మాటకి అర్థం అదేనా !

"మరి నువ్వు చేసినపని న్యాయమేనా ?" అన్నాను కొనవూపిరితో.

"ఏం పని ?"

"నువ్వు చెయ్యనిపని !"

"అంటే ?"

ఎట్లా చెప్పాలోతెలీక వూరుకున్నాను. వెళ్ళబోతూ ఆమె నాచేతిని ప్రేమగా పట్టుకుంది. కృతజ్ఞతతో నేమో ఏమైతేనేం, భగ్నమైన నాఆశ. నా కోపనం, నా నీచత్వం. అన్నీ కలిసి, ఏంచెయ్యలేక, చప్పునయేడ్చాను. తల్లివలె నాతలని వంచి నున్ననిరొమ్ములమధ్య అదుముకుంది.

"ఎందుకు ?"

"చెడ్డపని చేశాను." అన్నాను.

"ఎందుకు అంత ఆత్రుతపడ్డావు ?"

"నాకోర్కె."

"నేనెందుకు ? నాలో ఏముంది ? పిచ్చి ఎలికలదాన్ని."

"నిన్ను ప్రేమించాను."

"చూడు."నా మొహం యెత్తింది. నా కళ్ళమీద వేళ్లువేసి.

"మీ జాతికి మా జాతికి కుదరదు" అని దగ్గరగా నన్ను హొత్తుకుని గట్టిగా ముద్దు పెట్టుకుంది. పరవశత పొందాను. ఇంతమాత్రం ప్రేమ చూపితే, నా ప్రయత్నమంతా అట్లా భంగమయ్యేదా ? అన్యాయం చేసింది. ఇప్పుడేం లాభం అనుకుని ?

"మరి నీకు న్యాయమేనా ?"

"ఏమిటి ?" అన్నది.

"నామీద ప్రేమ చూపకపోవడం ?"

"నీకూ నాకూ ప్రేమ ఏముంది ?"

నోరు మూసుకున్నాను. కాని-

"పోనీ, ఇష్టం లేకపోతేనేం, సహాయం చేసివుండకూడదా?"

పదిహేనేళ్ళెందుకు చదువుకున్నాను ఆ మాత్రం 'ఆర్గ్యూ' చెయ్యలేకపోతే-ఆలోచించింది. చాలా దయగా - "నేనేం చెయ్యను ? మీరు నన్ను రేపందే ! మీకు శక్తిలేదు. మీరు వేరు మేము వేరు. అదే మావాడైతేనా !" అని చాలా సంతోషంతో "వారం రోజుల్లో వస్తాడు బైటకి, మా యిద్దరికీ పప్పన్నం పెడతారా !"

తడిసిన అలుకుగుడ్డ మల్లే యింటోకిపోయి మంచంమీద పడ్డాను.

పదుహేనేళ్ళ చదువు, పదేళ్ళ వుద్యోగం, చిన్నతనపు పెళ్ళి సంసారం-నన్ను యెరికల దానికి లోకువ చేశాయి. ఆ యెరికలాడు 'నా పెళ్ళాన్నేంచేశా' పని తిరగబడితే, పరిగెత్తాలి పోలీసు స్టేషన్‌కి.

"నీకు యిన్ని వేలు ఖర్చుచేసి, శ్రమపడి, బాగా తన్ని చదువు చెప్పించడంవల్లనే ప్రయోజకుడివైనావు" అంటారు పూజ్యులైన పెద్దలు.

ఇదీ నా ప్రయోజకత్వం.

(ఆమె ఈ భాష మాట్లాడలేదు. తెలుగే అదోరకం భారత ప్రయోగాలు వేసింది. చాలాసార్లు బూతులు మాట్లాడింది అవసరమైన చోట్ల. కొన్ని మాటలు మరిచిపోయాను. కొన్ని అచ్చులో వెయ్యనీరు. అందుకని నా భాషలో వ్రాశాను ఆమె సంభాషణకూడా.)

★ ★ ★

# ఒకస్వప్నము

రెండుసౌధములు. ఒకదానికెదురుగ నొకటి. ఒకదానికన్ననెత్తుగ నొకటి. చుట్టునిండ్లులేవు. ఊరులేదు. బాటలులేవు. పెద్దబయలు. పూర్ణమగు నిశ్శబ్దము. సన్నని చంద్రుడు మబ్బులేని ఆకసమున వెలవెలఁబోవు చుండెను. దీర్ఘమగునీడలు చుట్టుకొనిన కొండశిలలవలె సౌధములప్రక్క నిదురపోవుచుండెను. ఒక బాలిక మెల్లగదిగివచ్చెను. వెన్నెలలో ఒక నిముషము గోచరమయ్యెను. క్రిందినీడలో మాయమయ్యెను. రెండవ సౌధముచివర తిరిగి గదితలుపుతట్టుచు వెన్నెలయందు కాన్పించెను. తలుపు తెరువఁబడెను. ఒక యువకుఁడు ద్వారము కడనిలిచి కన్నులు నలుముకొనుచు చూచెను. ముఖమున నాశ్చర్యము. ఒకముహూర్తమట్లె నిలువఁబడి యుండిరి. నేత్రము లేమోమొ మాట్లాడెను. క్రిందికిదిగిరి. నీడలో మాయమైరి.

సముద్రతీరము. చలి. సన్నగఁబాడుగాలి. అల లొకదానిపైనొకటి దొర్లుచు ధవళత్వమున నుప్పొంగి యొకటేయాట. వానికేమిలక్ష్యము? ఏ ప్రొద్దోతెలియదు. సన్నని వెలుతురుమాత్రము. ఉషఃకాలమో, సాయం కాలమో, మధ్యరాత్రి నస్తమించు చంద్రుని వలనకలుగుకాంతియో! ఆ యౌవనుఁడును యువతియు వడివడిగనడచుచుండిరి. అతని చేయియామె నడుమును కౌఁగిలించుకొనియుండెను. ఆమెయు హస్తము నానుకొని అతని

శీఘ్రగమనము ననుకరించుచుండెను. చూపులెంతవఱకును ముందునకే. చలిలేదువారికి. సముద్రసౌందర్యమునుచూచి యానందములేదు. ఈవైపున సముద్రము. ఆవైపున రాజమార్గము.

ఒక మోటారుశకటము. దానివద్ద నొక ముదుసలియు, నిద్దఱు చిన్ని బాలికలును. బాలికలు తరంగములకవ్వించుచు, నవ్వుచు నొకటే యాట. యౌవ్వనుఁడు దాహమిమ్మని సంజ్ఞ చేసెను. మోటారుకప్పుపై నుండు పింగాణీపాత్రను చూపి ముదుసలి తనబాలికలవైపు చూచుచుండెను. వీరలెవరని యడిగినవారలుకారు దానియందుండెడి (కాఫీ యనుకొంటిని)ద్రవము నాబాలికచే నాతఁడు త్రావించెను. వడిగ నడచుచుండిరి.

ఇంకొక పెద్దమోటారుశకటము. మదరాసు కోమట్లిద్దఱు దానియందు "ఎచటినుండియో పారిపోవుచున్నారు. పాపము! ఎంతకష్టము!" అనిరి. అంతే, లోకమెప్పుడునంతే.

నడచుచుండిరి బాటపై నెదురుగవచ్చుచుండిరి ముగ్గురు. నలువది యేండ్లపురుషుఁడు,ఇద్దఱుస్త్రీలు, ఒకపెద్దమూట. వారినిచూచి బాలిక ముఖమునభయము. వెనుకకొదిగినది. ఆముగ్గురిముఖముల నాశ్చర్యము. ఆశ్చర్యము క్రోధముగ మారినది. గుసగుసలాడికొనిరి. నేనిట్లు గ్రహించి తిని:- బాలిక యీతని ప్రేమించెను. బలవంతముగ నితరునకు వివాహము గావింపఁబడెను. బంధువులగు వీరు ఆలస్యముగ ఆ పెండ్లి కేపోవుచుండిరి. పురుషుఁడు బాటదిగి తరంగములు భూమినికౌగలించుకొనుస్థలమున నిలువఁబడెను. ఈయిద్దరు నాగిరి. ఏదియో మాటలాడెను. బాలికను తనవెంట రమ్మనెను. నాగుండెలు కొట్టుకొనసాగెను. "ఇప్పు డేమిచేయును?' ' అనుకొంటిని ఎచ్చటనుండియోకాని అంతయు చూచుచునేయుంటిని.

కాని నాకుశరీరములేదు. ఏమిచేయుదును. చేయుటకు వీలైనచో, ప్రాణముల నర్పించియుందుననునంత ప్రేమకలిగినది. పిఱికివాడనగు నాభయమేకాని యౌవనుఁడేమియు చలింపలేదు. సముద్రతీరమునుండి దేనినో నల్లనిదానిని పైకితీసెను. పురుషునివక్షమునకు గుఱిచూపెను. అంతయు నొకనిముషమున జరిగెను. "చంపెదను. లేకున్న నిరువురము చత్తుము" బాటపై నున్న నిద్దఱు ముసలిపెంకెముత్తయిదువలు మోఁకాళ్లువంచి, నోర్లు తెరచి, గుడ్లగూబలవలె మూటనుబట్టుకొని చూచుచున్నారు. ఆశ్చర్యమో, భయమో, చలియో! వారికాశ్చర్యము నాకాశ్చర్యము. వారికి భయము, నాకుభయము. సముద్రమునకును. గాలికిని భయముకాన్పింపలేదు. ఆయువకునికినిలేదు. "నరహత్యకు సిద్ధపడెనే యీతడు ? ప్రేమబలము !" అనుకొంటిని. ముదుసలి తోకముడిచెను. "అయిన నెక్కడకుపోదురులే ! వెనుకనుండి చంపెదను" అనెను. అదిద్వీపముకాఁబోలు. అందుకే అట్టిధైర్యము. చుట్టును సముద్రము కాఁబోలు. పాపము!

ఏమియు జరగనట్లె నడచుచుండిరి. ఒకమాటైనలేదు. చిరునవ్వయిన లేదు. ప్రేమసూచనలునులేవు. కావలసినదంతయు నాహస్తస్పర్శయే చెప్పుచుండెకాఁబోలు !

పూర్ణమగు నంధకారము. నక్షత్రకాంతి. చిన్నిపడవను వదలించి యువకుఁడు లోనికినెట్టెను. ఇరువురు నధిష్ఠించిరి. అప్పుడు వింటిని యాజవ్వని మృదుకంఠస్వరము. ఇప్పుడైన యువకునితోకాదు. రెండు చేతులతో కన్నులుమూసికొని, తలవంచి "తండ్రీ ! ఆపదుద్ధారకా ! నీవు గాక గతిలేదు. ఇచక నీవుగాక యింకెవరునులేరు. సముద్రమునీది. నీ వలననే శాంతమువహించినది. నీవుతప్ప దిక్కులేదు. రాత్రియంతయు మా తోడనుండు మూఁడవవాఁడవు నీవె" పైనక్షత్రములు మిణుకుమనెను.

నీరుచప్పుడుచేసెను. గాలి చెంపలనుండి ముంగురుల కదల్చెను. తెడ్డుపడెను. పడవకదిలెను. అలలులేవు. పరమశాంతము. నీటిచారలో కదలు నక్షత్రకాంతి. నీటిపై గాలి. సన్ననిరోదనము. ఎటుచూచిని జలము. అంధకారము. ఆకసము సముద్రము. ఒక జేనెఁడుకొయ్యపడవమాత్ర మాధారము. పైన ఉన్నతము. క్రిందనగాధము. చలి. ఒడ్డుకానరాదు. ఎరుగుదురు? ఎటుపోవుదురు ? గతియేమి ?

నాకు మెలఁకువవచ్చెను.

గుడిపాటి వెంకటాచలం,
అనసూయ మాసపత్రిక,
ఫిబ్రవరి 1919

★ ★ ★

# యేం తప్పు ?

**ఛీ.** తప్పేమిటి ?

యిట్లారా

చీకటి వెలుతురుతో మెరుగుపెట్టినట్లు, నీ జుట్టుమీద చెయ్యేసి, నీ సన్నని, తెల్లని, మెత్తని చెంపల్ని తాకడం తప్పా ?

చీకట్లో మలయమారుతం మీద తేలే మబ్బుకి, వెలుతురు వొకపక్క మెరుగుపెడితే, దాన్ని తాకాలనుకోవడం తప్పా ?

యెందుకూ నవ్వుతావు ? నా మాటలకేనా ? నీ ముఖమును వెలిగించి, అదృశ్యమయ్యే ఆ చిరునవ్వును నా ముద్దులతో అట్లానే, యెఱ్ఱని పెదిమలమీద ఆపనా ?

అదీ తప్పే ? యేం ?

అస్తమించే సూర్యుడు యెఱ్ఱచేసిన మబ్బులోంచి కనపడే, అర్ధ చంద్రుణ్ణి, అక్కడే ఆపి ఆ సౌందర్య మనుభవించాలనుకుంటే తప్పా ?

యిట్లారా.

లోకపు నిందలతో, చివాట్లతో, అలిసి, దిమ్మెక్కిన యీ తలని, నీమీద అనించుకొని పరవశత్వము నొందనీ !

తప్పంటావా ?

ప్రేమ జలభారంతో బరువెక్కి వొంపుతీరిన ధవళారుణ పయోధరము మీద వొకసారి తలవానించుకొందా మని కోర్కెపడడం తప్పేనా ?

వెడుతున్నావేం ? పోనీను. యెందుకు తప్పో చెప్పి మరీ కదులు.

పోకుండా, నా రెండు చేతులతో నీమృదు శరీరాన్ని నలిగి బొయ్యేట్టు కావిలించుకొని, అట్టి పెట్టేసుకుంటాను.

యిది తప్పులేదు.

పరిగెత్తే, తెల్లని, మెత్తని, వెన్నవంటి, బూరుగ దూదివంటి కార్తీక మబ్బును కావిలించుకుని, చల్లగాలి వీచే మర్రిచెట్టు నీడలోకి తెచ్చుకుందా మనుకోడం ఏమీ తప్పులేదు, నాకు తెలుసు.

ఏదీ మొహం ? తిప్పివేశావేం? ఇట్లా తిప్పుకుంటాను. కళ్ళల్లో నీరే ! ఎందుకు ?

పోనీ గాని, ఆ నీరు నా పెదిమలతో తుడిచి, ఆ మెరిసే పాపల్లో అనంతమైన సౌందర్య స్వర్గాన్ని చూడనీ !

దీంటో తప్పేముంది ?

కాంతులు చిమ్మే శుక్రుడిమీద చిరుమబ్బు కమ్మితే దాన్ని తుడిచి ధగధగ మనే నా కోర్కెవలె మండే, ఆ ప్రేమలోకపు కాంతిని అనిమిషుడనై చూడ్డానికి ఆశపడడం తప్పుకాదు.

ఛీ ! తప్పు కానేకాదు.

తల పైకెత్తి నీలాంబరాన స్వచ్ఛందంగా గాలిలో విహరించే మేఘాలను చూడలేని అర్ధాంధులకు తప్పు, మనకేమి తప్పు ?

నక్షత్రాల మధ్య వుండే అగాడమైన లోతుల, గాడమైన అంతాన్ని స్పృశించి అమరత్వం పొందిన నీకూ నాకూ తప్పేమిటి ?

చీ పిచ్చి ఇంకా నీకు.

ఈ నీతి లోకపు వాసనలు పోలేదా ?

ఎంత తప్పు ?

★ ★ ★

# ఋషులూ-యోగులూ

పూర్వకాలం ఋషులూ, యోగులూ, కావడం, చాలా సుఖంగా వున్నట్టు కనపడుతుంది; యోగ్యతవుండాలిగాని, చిన్నతనంలో గురువు ఆశ్రమంలో భోజనమూ అదీ జరిగిపోయేది తరవాత సొంత రిసర్చికోసం ఆశ్రమాలు స్థాపించుకునేవారు, ఈ శిష్యులు గురువులుగా తయారై, గొడ్లనికాయడం, బట్టలు వుతకడం, ఊడవడం, అలకడం, వంటా, అంతా శిష్యులు చేసిపెట్టేవాళ్ళు. రాజాశ్రయంవల్ల తిండి జరిగిపోయేది. ఇప్పటి కవులమల్లేనే, సమితులుగా, యూనివర్శిటీల కింద, ఏర్పడి, ఎవరి అన్వేషణా ఫలితాల్ని వారు నివేదించికునేవారు వార్షికోత్సవాలలో. అంతే కాక, రాజులు సభ చేసినప్పుడల్లా అవీ ఇవీ గట్టిగా చదివి బహుమానాన్ని పొందేవారు. యజ్ఞాలకీ, యాగాలకీ, వీళ్ళందరూ కూడారంటే, సులభంగా లక్ష ఆవులూ, ఏనుగులూ, లెక్కలేని ధనాలూ, సంభావనలు దొరికేవి. ఆ బహుమతుల్ని ఏం చేసుకునేవారా, ఎక్కడ దాచుకునే వారా, మరి లక్ష ఆవుల్ని ఏ సంతలోనో అమ్ముకుంటే కొనేవారెవరా అనిపిస్తుంది. ఆనాటి బంగారం, రత్నాలూ, వీరాళాలు వింటే, ఈనాటి యుద్ధకాలపు కొరెన్సీకి గతి పట్టివుండదా అని సందేహం వొస్తుంది. కొందరికి ఉద్యోగాలుకూడా అయ్యేవి, రాజులదగ్గిర పురోహితులు మొదలైనవి. పెళ్ళిళ్ళూ చేసుకోవొచ్చు; సంసారాలూ వుండవొచ్చు. అదీగాక, తీవ్రతపస్సు చేసి ఏదేవినో, వేశ్యనో రప్పించి, విసుగుపుట్టగానే, సులభంగా వైరాగ్యంలోకి పోయి, ఆమెని మళ్ళీ ఆమె స్వస్థలానికీ ఏ అపవాదూ లేకండా పంపెయ్యవొచ్చు. చచ్చింతరవాత వీళ్ళకి ఇంద్రుడి దగ్గిరో, బ్రహ్మదగ్గిరో సీట్లు రిజర్వు అయివుండేవి.

ఇంత సుఖంలోనూ, వీళ్ళకో పెద్ద బాధవుంది. వీళ్ళు నివసించే అడవులే, రాక్షసులకికూడా నివాసస్థలాలు. చాలా త్వరలో రాక్షసులు వీళ్ళ రుచి మరిగారు. ఆ పూటకికూర దొరక్కపోతే, అట్టా షికారుకుపోయి ఓరుషినితెచ్చి తరుక్కు తినేవారు. ఈ రుషులకీ యోగులకీ రక్షణ అల్లా శాపదక్షత. కాని వేటగాళ్ళ మళ్ళేనే శాపం తీసేవ్యవధి నివ్వకండానే వీళ్ళని గొంతు నులిమేసే వారుగావును, ఆ రాక్షసులు. రాక్షస పల్లెలో ఓ రాక్షసాంగన ఇంకో రాక్షసాంగనతో,

"ఏం కూరమ్మా మీ యింటో?" అంటే.

"వంకాయీ మునీశ్వరుడూ" అంట్నుంది ఆమె

"మీ ఇంటో ఏం కూరమ్మా" అంటే,

"యోగి వేపుడు" అంటుంది, ఈ రెండో ఆమె.

ఇంతలో మూడో ఆమెవొచ్చి "ఇవాళ ఎవరిమొహం చూశారో, మా ఆయనకి ఏం దొరకలేదమ్మా. గురువుకి ఆకులు కోస్తావుండగా ఇద్దరు బక్క శిష్యులు దొరికారు. చట్టి అడుగున అంటుకుపోయింది కూర అంటుంది. "యోగులు దొరికితే సులభమమ్మా ఈ రుషుల ఈకెలు పీకేప్పటికి చేతులు పడిపోతున్నాయి" అంటుంది. మొదటి ఆమె.

కాని ఈ రుషులూ యోగులూ చాలాసార్లు కాటు వెయ్యనే వేసే వారు.

"మీ ఆయన ఏ రమ్మా కనపడటం లేదం"టే 'ఏమోనమ్మా, మా అబ్బాయి పెద్ద కోరమొలిచిన పండక్కి ఓ బతికిన యోగిని తెమ్మన్నాను, పలావు వండుదామని. ఏమైనారో, రెండువేల ఏళ్ళయింది. ఇంకా రాలేదు.' ' అంటుంది.

"మొన్న సాయింత్రం మీ ఇంటిచుట్టూ మూలుగుతూ ఓ పెద్దపులి తిరుగుతోంది. అది మీ ఆయనేనేమో అనిపించింది. ఆయనమల్లే వెనక్కాలు కుంటుతోంది" అంటుంది ఆ రెండోఆమె

ఇది వింటున్న మూడో ఆమె రంగంమీదికి వొచ్చి,

"అంతేనమ్మా మా చెల్లెలి మొగుడు అట్లానే ఓ యోగిని పట్టడానికి ెళ్ళి మళ్ళీ రాలేదు. సాయంత్రానికి ఓ పెద్ద కొండసిలవచ్చి ఆమె కాళ్ళను పట్టేసుకుంది. ఆమె కేకలుపెడితే చంపడానికి వెళ్ళాం. తీరా దగ్గరికి వెడితే ొండసిలవకి పెద్దమీసాలు. వాటినిచూసి గుర్తుపట్టాం మా మరిది అని" ంటుంది.

ఇంతలో మూడోఆమె-

"అంతకన్నా చిత్రం, మా మరదలు సంగతి తెలీదూ. అది నీళ్ళాడింది. త్యానికని దాని మొడగు బాలముని కోసమనిపోయి మాయమైనాడు. రువేళ్ళ ఏళ్ళకీ తిరిగి రాలేదు. తిండికి జరక్క మా తమ్ముణ్ణే చేసుకుంది. ేసుకున్న వెయ్యేళ్ళకే ప్రత్యక్షమైనాడు ఓ నాటి రాత్రి వాళ్ళ మంచంకింద న్నంలోంచి. 'చూస్తున్నాలే నీ పోకిల్లు" అన్నాడు దాని కొప్పుపట్టుకుని, ట్లాచూశానంటే, నువ్వు వాణ్ణి కావలించుకున్నప్పుడల్లా మీ కాళ్ళ సందు చకిచమనే చుంచు ఎవరనుకున్నావు, నేనే. ఆ బాలయోగి వెధవ, కుత్తుక లుముతుండగా, 'చుంచువవు అన్నాడు' అని యేడ్చాడు.

మొత్తానికి ఈయోగులూ రుషులూ యీ రాక్షసుల అవసరాలకు ొకువైనారు. భారతీయ యుద్ధంలో 18 అక్షౌణీలు ఎందుకు గుమిగూడారో ెలీదు. ఈ పెద్ద వీరుల చేతులతీట వొదిలేట్టు చంపుకోడానికితప్ప వాళ్ళు ేసిన ఒక్కపనీలేదు. భీష్ముడి ఆగ్నే యాస్త్రానికి ఇటు అర్థలక్షా, భీముడి దాఘాతానికి అటు ఓ లక్షా చావడం ఒక్కటే వాళ్ళకి నియమించిన ధర్మం. ట్లానే ఆటంబాంబుకింద ఆవిరికావడంతప్ప తక్కిన వివరాలు ఏమీ తెలీవు, ాగసాకీ ప్రజల్ని గురించి. యీ యోగులు కొన్ని లక్షలూ కోట్లూ వరసగా ్వంసమౌతో వొచ్చారు. కాని ఆ అధ్యాత్మిక మధువు ఎట్లాంటిదంటే, ఎన్ని ులుగుబంట్లు దోచుకున్నా, మళ్ళీ ఆశ్రమపట్టు పెడుతూనే వుంటారు. చివరికి డలేక ఏ ఇంద్రుడితోనో, విష్ణువుతోనో, మొర పెట్టుకుంటారు. దానివల్ల క అవతారం. ఆ అవతారం పుట్టినప్పుడూ చచ్చినప్పుడూ మధ్య, మధ్యా,

స్తుతులకీ ఆరాధనకి దండకాలు చదవడానికీ, వీళ్ళు హాజరౌతో వుంటారు. ఈ లోపల వీళ్ళనెవరూ భోజనానికి ఉపయోగించుకోపోతే, వీళ్ళకి కొవ్వు లేకపోతే వీళ్ళని బలిపించడానికి కొన్ని ఏళ్లు కందమూలాలుతెచ్చి వీళ్ళ ఆశ్రమాల ముందు పడేస్తో వుండవొచ్చు, రాక్షసులు.

సౌరిస్ అంటుంది యీ ఆర్యులుకూడా జనసంఖ్య ఎక్కువై ఇంగ్లీషు వాళ్ళ పద్ధతిమీదే వ్యాప్తి చెందారని. ఈ ఋషులుపోయి అనార్యుల దేశాల్లో ఆశ్రమాలు పెట్టుకున్నారు, ఆర్యావర్తం అడవుల్లో ఆశ్రమాలు ఎక్కువై సందులేక. మరి ఆ అనార్యులు వూరుకుంటారా ? వీళ్ళని వొండుకుతింటారు, వూరగాయలూ పెట్టుకుంటారు. అదుగో మా ఋషుల్ని హింసిస్తున్నారని వంకపెట్టి ఆర్యరాజులు యీ అనార్యులమీదికి దండెత్తి వోడించి రాజ్యాల్ని ఆక్రమించుకుని ఆర్యులికి చోటుచేసి, మతమూ, తమ నాగరికతా ప్రవేశపెట్టేవారు, ఆర్యకవులు ఆ అనార్యుల్ని, అనాగరికులనీ, మనుష్య భక్షకులనీ, రాక్షసులనీ, మాయావులూ, పది, యిరవై తల వాళ్ళనీ, వర్ణించి, తమ రాజుల్ని పొగిడి అక్కర లక్షలు సంపాయించే వాళ్లు.

ఇవీ పురాణ గాధలన్నీ.

★ ★ ★

# పిన్నికి లేఖ

**శ**రశ్చంద్ర 'సవిత' చదివాను, చివరికి ఓహో ఎంత గొప్పగా రాశాడు అనుకుంటో, అబ్బ ఇంక ఒక్క పేజీ నడవదు అని విసుక్కుంటో, ఇతనింతే అని తిట్టుకుంటో, నా కధలతో పోల్చుకుంటో. శరత్ అకర్షణలో ముఖ్యమైన సంగతి అతని పాత్రలమీద అతనిదయ, ప్రేమ-చాలా గొప్ప విషయం. మనిషే చాలా ఎదిగి వుండాలి. అతనికి దేనిమీదా ద్వేషంలేదు. తగాదా లేదు సంఘం మీదగాని, కర్మ మీదగాని, దేవునిమీద గాని, గొప్పకళగల రచనలకి ఒక ముఖ్య సూత్రం అది-ఏదో బలంలేక, నిస్సత్తువగా కాదు. తెలుసుకుని, అనుభవించి, స్తిమితపడి, బలంగా ప్రేమిస్తున్నాడు లోకాన్ని అన్ని లోపాలతోనూ దుఃఖాలతోనూ. తన పాత్రలతో కలిసి ఏడుస్తాడు. సానుభూతి చూపుతాడు; సాయపడతాడు. అంతకన్న అశాంతిని ధిక్కారాన్ని రేపడు.అందువల్ల బెంగాలీ రసగుల్లాలమల్లే తీపి ఎక్కువౌతుంది. వుప్పూకారం తక్కువౌతాయి. కొన్ని చోట్ల నిజాన్ని ఎదుర్కొని చెప్పగల సాహసమో, బలమో కొరత పడ్డాయనిపిస్తుంది. లేక టాగూరు మల్లే అది ఓ కళానియమంగా పెట్టుకున్నాడో! ఈపుస్తకంలోంచి తప్ప అతనిసంగతి నాకేం తెలీదుమరి మనుషుల్ని వాళ్ళ బలాలతో, బలహీనాలతో అర్థం చేసుకోగల ప్రజ్ఞ గొప్పగావుంది- అనేక రకాలైన మనుషుల్ని. కాని ఆ జ్ఞానమంతా చూపడో, చూపతలుచుకోడో !

ఈ కథలో ఒక అరడజనుమంది స్వార్థరహితుల్ని చేర్చాడు- ఒకర్ని మించినవాళ్ళు ఒకళ్లు, వాళ్ళని వాళ్లు దానాలు చేసుకోవడంలో- చాలా ఘోరం. కొంచెం మనం ఎరిగిన మనుషులవంటివారు ఒకరిద్దరు తొంగి చూస్తారు గాని వాళ్ళని. తెరవెనక్కిలాగేస్తాడు, వాళ్ళపాడు మొహాల్ని ప్రజలకి చూపవొద్దని ఒకవేళ మామూలు మనుషుల్లో ఆ మంచి భాగమే మనకి కనబరచాలనిఅతని ఉద్దేశ్యమేమో!

అతని పాత్రల సంభాషణలు మామూలు మనుషులవి కావు. సూటిగా ఒక్కటీ ఆ రెండోవారికి మనకీ అర్థమయ్యేట్టు మాట్టాడరు. ఏదో సమస్యలలో ఎటుపడితే అటు తప్పించుకోడానికి వీలైవట్టుగా పలుకుతారు. ఆ దొంగతనం అసలు రచయితలోనే వుందనిపిస్తూంది. కొన్ని చోట్ల సంభాషణలు నాకు అర్థంకాలేదు. అది మరి అనువాదం లోపమేమో! అర్థమైనవి కూడా చాలా వంకర తిరుగుళ్ళు. ఒకటే టీ తాగి, తీపి పలహారాలుతిని తియ్యతియ్యగా, వెచ్చవెచ్చగా మాట్లాడి తప్పించుకుంటారు. ఆ మనుషులు ఎదుర్కొంటున్న సమస్యనించి మాటలతో దాక్కోవాలని చూస్తారు కాని అతనిలో సంభాషణా చాతుర్యం, నడకా, అమోఘం. బారువా చిత్రాల్లో మల్లేనే, బయట సమస్యలకన్న హృదయాల్లోని సమస్యలెక్కువ. కొంచెం బుద్ధిమంతుడైన ఆంధ్రుడు వాళ్ళ మధ్యవుంటే, వాళ్ళ జీవిత సమస్యల నన్నింటినీ మూడు నిమిషాల్లో బుద్ధిచెప్పి తీర్చేవాడనిపిస్తుంది.

భక్తితో పాదధూళుల్ని తీసుకొంటోనే వుంటారు. మర్యాదగా మటు మాయమౌతూ వుంటారు చాలాదొంగలు. 'మీతో మాట్లాడాలి' అంటారు, టీ తాగుతారు, సరేలే సాయంత్రం మాట్టాడదామని వెళ్ళిపోతారు. సాయంత్రమైనా అటూ యిటూ మాట్టాడి, అసలు సంగతి తేల్చుకోకండా వెళ్ళిపోతారు. నిలబడి ఏమిటని ప్రశ్నిస్తే ఏం విరిగి మీదపడుతుందో నన్నంత

ఆత్మలో పిరికితనం. అందువల్లనే వాళ్ళజీవితాలే మాటలు. మాటలు. కాని ఆ మాటల్లో ఎంత గొప్పతనం, చాతుర్యం, మాధుర్యం !

ద్వేషంలో బలం కనపరచడం సులభం. తియ్యని ప్రేమలో బలం చూపడం చాలాకష్టం. ప్రయత్నించాడు శరత్. కాని చూపలేకపోయినాడు.

ఆ సవితని తలుచుకుంటే, నాకు పరమ అసహ్యం. భర్తని వొదిలి ఎందుకు లేచిపోయిందో కూడా ఆమెకే తెలీదట పదమూడేళ్ళు 'అలా, అలా, ఏమీ తెలీకండా గాలిలో, గడియారానికి సంబంధించిన కాలంలో తనకి శరీరమే లేనట్టు, ప్రియుడితో పాపం చేసిందిట'' అందరిచేతా ఆమెని ఆరాధింప చేశాడు. కాని నాకేమీ గొప్పరాలేదు ఆమెలోంచి. అటువంటి ఆమెని ఆరాధింప చెయ్యడమే శరత్ గొప్ప. ఎంత దొంగదెబ్బ సంఘం మీద !

తన ప్రేమవల్ల నిజాన్ని మరుగుపరుస్తాడు శరత్. నిజాన్నంతనీ కూడా స్వీకరించి ప్రేమలో జీర్ణించుకునేశక్తి లేదు-ఆ శక్తి కొంచెంగా టాగూరులో, ఇంకా ఎక్కువగాడాస్టవిస్కీ, చకోవ్ మొదలైన రష్యను రచయితల్లో చూస్తాము, అక్కడక్కడ బాల్జాక్ గొప్ప కథల్లోనూ.

అతను ప్రయత్నించిన గొప్ప సంస్కారం, సంఘ బహిష్కృతురాలైన స్త్రీని, అన్నివిధాలా గొప్పదాన్నిచేసి చూపడం. కాని ఆమె మనసులో ఆ నేరభావం కాలుస్తోనే వుంటుంది. 'అట్లా చేసినా, ఆమె గుణవతి' అనిపిస్తాడు, చాలా excuses తో. చివరికి నెట్టాడు బలవంతంగా భర్త సేవలోకి. అందువల్ల ప్రజలు సానుభూతిని సులభంగా కొట్టేస్తాడు. తన ఉద్దేశ్యం ఎవరికి ఏ నొప్పీ కలగకండా సాధించుకుంటాడు. ఏది వర్ణించినా, ఏ సంఘటనా, దృశ్యమూ చాలా స్పష్టం. మనసులో నిలిచిపోతాయి. కాని అందరు పాత్రలూ మంచితనం, త్యాగం, పాతివ్రత్యం మర్యాద, వీటిల్లో నీరసపడి పాకుతారు. మనుష్య ప్రయత్నానికి చాలా తక్కువ ప్రాధాన్యమిచ్చి, ఏదో విధో, కర్మో

వాళ్ళనీ జీవితాన్నీ, మెల్లిగా, తీరుబడిగా, లాక్కుపోతున్నట్టుంటుంది. శక్తి తక్కువ, ఉత్సాహంతో, బలంతో ఇది చెయ్యాలి- అనే దీక్ష తక్కువ ఆ మనుషులకి.

మనుషుల లోపలి లోతైన దృష్టి, గొప్ప సహృదయత, మర్యాద, చాలా మర్యాద మనుషుల యడల, తియ్యతనం, పీటర్ ఛానీ నవలల్లో ఎంత తాగుతారో, చలంకథల్లో ఎన్ని ముద్దులు పెట్టుకుంటారో, ఇతని కథల్లో అన్ని కన్నీళ్ళు' ఎప్పుడూ కళ్ళు చెమ్మగిల్లుతూనే వుంటాయి. టీ తాగడం యాడవడం.

ఈ కర్మభూమిలోని నిజమైన జీవితాన్ని చాలా అందంగా చిత్రించాడు, కాని చివరికి ఈ నవలలు చదివి 'ఇంతే జీవితం. ఏం చేతకాదని' నిశ్చింతగా నిద్రపోవడమూ; ఇంతేగతి అని రహస్యంగా ఏడవడమే ఎక్కువౌతుం దేమోననుకుంటాను.

నా విమర్శకులు నన్నునేట్టే, నేను శరత్‌ని "శరత్, నీకలంలో అంత దయా, మాధుర్యం, బరువూ, జీవితంమీద గొప్ప విలవా, నిపుణతా, కథ చెప్పడంలో అద్వితీయమైన కౌశలం, వున్నాయి. కాకపోతేనా నిన్ను చీల్చి చెండాడాలన్నంత కోపం వొస్తోంది నాకు" అంటాను.

★ ★ ★

# లేఖ

My Dear Souris,

వచ్చాను. మొదటిరోజు సంగతులే కథలాగూ, కలలాగూ, ఉన్నాయి. బెజవాడ రైల్లో Inter ని చెన్నపట్నంలో పూడ్చిన చెత్తతో నింపి పంపారు. కాని బాగానే ఉంది. Harmless చెత్త. తాడేపల్లి గూడెంలో బస్సులు కాలం వొదిలేశాయి. Beyond limits of time. వాటికి కాలమూ, స్ప్రింగులూ, లేవు. అప్పుడప్పుడు దోవలో "ఇప్పుడు రెండు గంటలా, అయిదుగంటలా?" అని indifferent గా అడుగుతో వుంటారు. కొన్నాళ్ళుపాతే "ఇప్పుడు మూడో తారీకా, ఆరో తారీకా ?" అని అడిగేటట్టున్నారు. రెండో తారీకున బయలుదేరి, చివరకి 5 1/2 కి చేరాము, ఎన్నో కాలువలు దాటి. ఇన్ని నీళ్ళు Bengal లో తప్ప యెక్కడా వుండవేమో ? ఇంత ఎండాకాలంలో పెద్దకాలువలు నిండుగా పోతోంటే, దేవుడిలో విశ్వాసం, తిరుగబడుతుంది. నేను dream చేసినట్టే బంగళా పెద్దకాలవ పక్కనవుంది. కాని వీపు కాలవకి తిప్పింది-యీ మధ్యే తిప్పివుండాలి, యీ బస్సులు దుమ్ముచిమ్మడం ప్రారంభించిం తరవాత. దగ్గిరే లాకులు, తోటలు.

ఈ వూళ్ళో యేమీ దొరకవు, ఇవి తప్ప-

కొబ్బరికాయలు

చెరుకులు

కమలాలు

మల్లెపువ్వులు.

ఇంకేంకావాలి ? ఈగలూ, సాలీళ్ళూ, బొద్దింకలూ, లేవు. ఎందుకంటే దోమలు మనుష్యులు చాలక వాటినికూడా తిన్నట్లున్నాయి. దోమలు వున్నా ఈ Commercial medical travellers పంతులుబోటివాళ్ళు వాటి ముక్కుల్ని కోసి injection సూదుల samples కింద పంపారు, అందుకని గావును కుట్టవు.

బంగళావాడు ఒక thug. నిన్నటినుంచి నేను తిని పోసిన బంగారు తీగె చెరుకుచెత్త ('చే'తో చెప్పు. S S.L.C. పరీక్షమాని వొచ్చేసే ధైర్యం వొస్తుందేమో.) చూసి, నన్ను బంగళాలోంచి వెళ్ళగొట్టటానికి అది తగిన కారణమా లేదా, అని యోచిస్తున్నాడు. బంగళా thug నా తక్కిన పనుల్ని బట్టి నేను lunatic నని యీ మధ్యాహ్నంనుంచి జాలిపడుతున్నాడు. అతనికి సాయంత్రం omletts కి డబ్బులు ఇచ్చి అతను తెచ్చి లెఖ్ఖచెపుతో వుండగా, పెనుగొండ బస్సు గుమ్మంలోకి వొస్తే డబ్బులు తీసుకోక, ఏమీ చెప్పక గది అట్లానే వొదిలి అతనుచూస్తో వుండగా మాయమైనాను. ఆ పెనుగొండలో సబ్‌రిజిస్ట్రారు ఆఫీసుకి కూడా చిన్న డింగీలోకాలవ దాటాలి. అట్లా కాలవ ఎప్పుడూ దాటుతోనే వుండక, ఎందుకు పనులుచేస్తారో ఆ ఆఫీసులో. మళ్ళా ఇంటికి నడిచి వొచ్చాను దూరమూ, కాలమూ, మరిచి. చంద్రుడు చెట్లమీదనించి కాలవలోకి తొంగి చూస్తున్నాడు. వొచ్చి బంగళావాణ్ణి apologies కోరి, భోజనం తెమ్మని వూళ్ళోకి పంపాను. మళ్ళీ చెరుకులు అందుకున్నాను. హఠాత్తుగా ఒ-ఓ బస్సు తీసుకొచ్చి (యీ వూళ్ళో బళ్ళూ, సైకిళ్ళూ, కార్లులేవు. ప్రతి పనికీ బస్సే ! చిన్నపిల్లలు tricycles బదులు perambulators బదులు బస్సులోనే వెడతారు. పెళ్ళికొడుకులు వూరేగడానికి, పీనిగలు స్మశానాలకి పోవడానికీ బస్సులే !) పాలకొల్లు పోదాం

రమ్మని తీసుకుపోయినాడు, బస్సులోకి. చెరుకు కఱ్ఱ వొదిలి, వెళ్ళాను. బంగళావాడు, వెన్నెట్లో యెదురుపడి టిఫిన్ కారియర్‌తో డాన్సు చేస్తున్నాడు, బస్సువెనుక.

మళ్ళీ కాలవవొడ్డున. వెన్నెట్లో ఎక్కడికో ! సరిగా సినిమాకి వెళ్ళాం. లోపల గగ్గయ్య (మైరావణలో) అరుస్తున్నాడు. గగ్గయ్యేనా! ఎవడో భోజనం తెప్పించారు. హాలుబైట నాకు 9 1/2కి తిండి. లోపల చాలా గొప్పసీను జరుగుతోందంటే వెళ్ళాము. చంద్రసేన పడకటిల్లు. ఓ మంచం శ్రీరాముడు కూచుంటే విరిగింది. ఆ కీచుగొంతుకతో అరిచే ఆ కాంచనమాలని ఎట్లా భరిస్తారో ! అచంద్రసేనని చూసి ఆ బానకడుపు లబ్బీవాడు శ్రీరాముడు కూడా నిరాకరించేడంటే, ఆశ్చర్యమేముంది ! ఆ చంద్రసేన యేడుపు, హాహా అని యేదో realize చేసిన పాడుమొహం- భరించడం కష్టం. ఆ శ్రీరాముడు మనింట్లో నౌకరుగా వొస్తానంటే "నువ్వు మా మంచాల్లో నల్లుల్ని హత్యచేసి తినేట్టున్నావు. వొద్దు పొమ్మం"టాము.

తరువాత పెళ్ళిలో భోగంమేళం చూడ్డానికి వెళ్ళాము. నన్ను గొప్పచేసి నా మొహంమీద వాళ్ళనాట్యం పట్టించారు. వాళ్ళల్లో ఒకత్తె చాలా చక్కని అమ్మాయివుంది. చక్కదనమే కాదు-కళ్ళల్లో చాలా కళలు చూపుతుంది. ఆమె నా కళ్ళల్లో వేళ్ళు పెట్టి, అల్లరిచేసింది. కాని art కాని music గాని లేవు. తక్కినవాళ్ళలో అందమూలేదు. కొంతసేపటికి నాకు విసుగుపుట్టి పోదామన్నాను. "వీల్లేదు-ఒక అమ్మాయిని కోరుకో, వీళ్ళతో nightspend చేద్దామన్నాడు నామిత్రుడు. ఆ అమ్మాయిమీద too much respect నాకు. తక్కిన వాళ్ళ మీద too much contempt. కనక నాకక్కర్లేదు. "ఇంటికిపోతా" నని మారాం పట్టాను. 'ఎందుకు' అంటే 'నిద్ర' అని వొంకపెట్టాను. కాని ఇంటి బెంగ పట్టుకుంది. ఎక్కడో పక్క ఏర్పాటు చేస్తామన్నారు. miserableగా home sick గా feel అయినాను. Home ఏమిటి అని నవ్వుకుంటాను.

కాని పోవాలి. ఎక్కడికో పోవాలి. కాఫీ హోటలుకి. రాత్రి పదకొండింటికి. ఆ బల్లమీద తలపెట్టి నిద్రపోయినాను, వాళ్ళుతింటోవుంటే మూసేశారు హోటలు. బయటికి వొచ్చాను, వొంటరిగా! బస్సుడ్రైవరు వచ్చాడు; ఒక request తో. 'ఇన్‌స్పెక్టరుగారు రెండింటికే బయలు దేరతా మంటున్నారు. తమరెట్లానన్నా నాలుగు గంటలు చెయ్యండి-మాకు కొన్ని టిక్కెట్లు దొరుకుతాయి'' అని. నన్ను !!! ఛస్తోవుంటే కాకినాడ తురక సన్నాయివాళ్ళు జ్ఞాపకం వొచ్చారు. ఇంతేనా యీ రాత్రికి ! ఏదన్నా miracle జరక్కూడదూ! భగవాన్ కారులోవచ్చి ఆ యెనిమిది మైళ్ళూ నన్ను తీసుకుపోకూడదూ ! మిత్రుల్ని కలుసుకున్నాను. పోతానన్నాను వినరు. నవ్వుతారు. "నీకు తమాషాలు చూపుతామం"టారు. ఆ ఫలహారాలు, ఆ కోమటి కుర్రాళ్ళు, ఆ భోగంవాళ్ళు-ఇవీ తమాషాలు. అవి Enjoy చెయ్యలేనే అని నా దిగులు. సంతోషంగా నవ్వేవాళ్ళని చూసి నాకు Envy. ఒక gunset మేళం దగ్గిరికి వెళ్ళాం. చాలా బాగా వాయించాడు. అతనివేళ్ళు గుండెలమీద ఆడాయి. కానినేను నా misseryని వొదల తలుచుకోలేదు. రోడ్డు మధ్య పక్కవేసి నిద్రపొమ్మన్నారు ఆ మేళాలమధ్య! మిమ్మల్ని తలుచుకున్నాను. హాయిగా నిద్రపోతో వుంటారు.

ఎందుకు వొచ్చానిక్కడికి? ఒచ్చితిబో ! వీళ్ళతో ఎందుకు బయలుదేరాను? ఎవరూ పిలవని నన్ను, ఒకాయన బస్సు తీసుకొచ్చి రమ్మన్నాడనే బడాయివల్లా ! భగవాన్ మీద కోపమొచ్చింది. ఎందుకు ఇట్లాంటి గోలల్లోకి నెడతాడు నన్ను ! ఒక సైకిలన్నా జట్కాఅన్నా ఇయ్యండి పోతానన్నాను. "పడుకో ! మూడింటికే వెడదాంలే" అన్నారు. అంతలో గోల! గుంపు ! మా బస్సు డ్రైవర్ని కొట్టి పోలీసులు లాక్కెడుతున్నారు, భోగంవాళ్ళని అల్లరి చేశాడని. లాకప్పులో పెట్టారు. ఇంక నా గతేమిటి ! ఆ గోలలో తప్పించుకున్నాను. వొంటరిగా పోతున్నాను-ఎనిమిది మైళ్ళూ నడవాలనే ! ఎట్లానూ తెల్లవారుతుంది. కాని కూచోలేను. పడుకోలేను. మళ్ళీ నా నిద్ర

కళ్ళముందు సినిమాహాలు ! రేపు 'బాబీ' అని ఇందాకటి సినిమా అతను, నాకు భోజనం పెట్టిన ఆయన, మైరావణమెచ్చుకునే ఆయన! బాబీ చాలాగొప్ప బారువా డైరెక్షన్ అని పొంగి పోతున్నాడు, ఎవరితోనో! వింత ఆంధ్ర దేశం! మైరావణనీ, బాబీనీ కలిపి మెచ్చుకునే మనుషులు ! ఆసినిమా ఆయన్ని బతిమాలితే, సైకిలిమ్మని! childని నేను ! పక్కేసి, పడుకో మంటాడు. ఆ సినిమాలో, గగ్గయ్య అరుపుల్లో నిద్రా! గగ్గయ్యేనా! నా బాధయేమిటో ఎట్టా చెప్పను అతనితో ? టీటిల్ కురుపుకన్నా ఎక్కువ బాధ అని! నాకే తెలీదే! ఈ childish helplessness చూస్తేనాకు చాలా కోపం నామీద! కాని చాలా ప్రేమకూడా నన్ను అమితమైన తిప్పలు పెట్టింది జీవితంలో. కాని అదేనాలో lifeని freshగా ఉంచుతోంది అనుకుంటా.

నడిచాను. ఊరిబైట కాలవవొడ్డున విప్పేసిన జట్కా, దీక్షితులు గారు భగవాన్ అనుగ్రహం అంటారు. పన్నెండణాలకి తీసుకుపోతాడట. ఇస్తాను. దిగులేసింది. అలిసిన గుర్రాన్ని మళ్ళీ ఎనిమిది మైళ్ళు పరిగెత్తించాలి. కాని self, self నా బాధ ! బండివాడి దగ్గర అయిదు రూపాయిలకి చిల్లరలేదు. మళ్ళా దుకాణాల దగ్గరికి. ఆ రాత్రి ఎవరిస్తారు ! Gold flake అనేటప్పటికి అరగంటలో చిల్లర పూడిపర్తది. నా మిత్రులు తరుముకు వొస్తున్నారని భయం, జట్కాలో కూచుని పరుగు fugitive లాగు. ఆ గుర్రం భగవాన్ అనిపించింది. ఎందుకు పరుగు! ఏమిటి భయం ! ఎవరికి తెలుసు? లోకంలో భయాలన్నీ ఏమిటి? నా వెర్రిభయం నాది ! మళ్ళీ వెన్నెల్లో కాలవ పక్కన చెట్లనీడలో-నిద్రలో తేలిపోయే పడవల్ని చూస్తో-అమ్మవీ, నావీ పేర్లు 20 ఏళ్ళకిందట చెక్కిన జ్ఞాపకాలలో పలవరించే చెట్లకిందనించి ఈనా వూరు. బంగళా. ఏమైనావని ప్రశ్నలు, గొణిగే వాచరు-Sleeping dose- నిద్ర-తెల్లారి తల నెప్పి- మళ్ళీ- duty- పరీక్ష పేపర్లు చెక్కింగ్ !

ఎంత కథ !

ఇంక యీ బంగళానుంచి కదల దలచుకోలేదు. యివ్వాలిటికి !

బ-ఇంటో భోజనం యివాళ, వాళ్ళింటో gramaphone అన్నీ సైగల్ రికార్డులు. కాని ఆ sound-box వేలుతో తోస్తూ వుంటేనే గాని, గీతని వొదిలి గీతకి నడవదు. ఒక silent relative అట్టా నెట్టుకుంటూ వుండాడు, అన్ని గంటలూ ! రామశాస్త్రిగారు ఏమంటారో !

దీక్షితులుగారు వొచ్చారేమో, బెజవాడ !

ఎవరన్నా మిత్రులొస్తే, యీ నా చరిత్ర చెప్పు వాళ్ళకి.

సాయంత్ర మవుతోంది. చదివి చదివి బైటికి పోవాలనిపిస్తోంది. పాలకొల్లు వేపైనాసరే ! భగవాన్ కూడా నా బుద్ధిని మార్చలేడనుకుంటా. లాకుల దగ్గిర కూచుందామంటే వాన కురిసిన నేల. బురద. 'చే' కోప్పడుతుందని భయం.

మళ్ళీ Russel's Relativity చదువుతున్నాను. సైన్సు చదివిన కొద్దీ భగవాన్ చెప్పే దాంటో విశ్వాసం ఎక్కువవుతోంది. కొన్ని భగవాన్ వాక్యాలు యీ సైన్సు పుస్తకాల్లో కనబడతాయి.

ఆ బోగం వాళ్ళ నాట్యాన్ని చూస్తే రోహిణి యేమనేదో కాని ఆ అమ్మాయిలో యేదో గొప్పతనం వుంది.కాని ఆ రాత్రి నా ప్రక్కన కూర్చున్న నల్లటివాడు ఒకడు పదిహేను రూపాయిలకి కొన్నాట్ట, ఆమెని ముందు రాత్రి ఆ కలలుకనే కళ్ళని-కాని పెళ్ళి చేసుకుంటే మాత్రం- ప్రేమిస్తే మాత్రం- అంతా కొనడమే, నా కలల్ని, నా స్వేచ్ఛని, నా శక్తిని-రోజుకి అయిదు రూపాయిలకి కొన్నారు ఆమేనయం. ఒక రాత్రికి పదిహేను రూపాయలు ! మంచి reasoning గే గాని, వొప్పుకోదు హృదయం- ఆకళ్ళలో అందాన్ని, ఆ నల్లపాపల్లోని వెర్రిఆశల్ని నా వేపు చూడ్డంలో ఆ అల్లరిని, దీనత్వాన్ని, ఏదో నాకు తెలీదుకాని, దేని మీదనో తిరగబడుతుంది మనసు. నా friend's offer ని accept చేసి, ఆ అమ్మాయితో మాట్లాడి వుంటే! ఆమె soul కి

appeal చేసివుంటే! కాని ఆమె కాంచనమాలమల్లే మాట్లాడితే! ఈ కలలన్నీ యేమవుతాయి! కాని ఆమె ఆ కళ్ళల్లో కాంతి reality యేనా ! నేను కల్పించుకున్నానా ? space and time reality కావంటున్నాడు, Russel !

ఏదో ఇదంతా ఉత్తరం కాకుండా musings అయిపోయినట్టుంది, చివరికి !

ఎండ వొచ్చింది. లోక మెట్లావుందో పరీక్షిస్తాను.

నువ్వు వొస్తే ఎట్లా వుండేవాణ్ణి-ఏం చేస్తో వుండేవాణ్ణి అనుకుంటూ వుంటాను "వొయ్యి"కి చెప్పు, ఇదంతా. అమ్మ కురుపు నయం అయిందని నాకు తెలుసు ఏన్ని వొస్తే నువ్వురా. తాడేపల్లి గూడెంలో దిగగానే దగ్గిరే బస్సు directగా.

అప్పుడే నన్ను బంగళాలో కుక్క వొకటి పెంచుకుంది.

సైకిలు అద్దెకు తీసుకుని "భాభీ"కి పోవాలని నిశ్చయం చేసుకున్నాను.

రానుపోను పదహారు మైళ్ళు తొక్కాలి. కానీ.

నూరుమైళ్ళు వచ్చానో, లేదో ! ఆఫ్రికా మధ్యనుంచి రాస్తున్నట్టు రాశానని నాకే నవ్వుగా వుంది. కాని illusion పోతుందని నా భయం! చిన్నప్పటి illusions పోయేగా జీవితం నిస్సారం అయిపోవడం ! వెన్నెల కోసం wait చేస్తున్నాను. ఒక కాలవ వుంది. mysterious గా చెట్లలోకి పోతోంది. దాన్ని explore చెయ్యబోతున్నాను యీ సాయంత్రం. వన్యమృగాలు, బిల్లుల ఆర్తనాదం యివి కూడా చేసుకో గలిగితే ! Princes in danger-పోనీ నిన్నటి బోగం అమ్మాయి in danger లో వుంటే! వుంది అనుకోగలిగితే !

Illusions పోవలసిందే ? కాని పోతే పూర్తిగా పోయి truth and light break కావాలి. అందమైన ilusions పోతాయి. ఉద్యోగం, అధికారం, డబ్బువిలువ, మర్యాద, comfort, దేహం భయాలు-దిగుళ్లు-యీ iilussions మిగులుతాయి తల నెప్పులు కూడా.

నిన్నరాత్రి వెన్నెట్లో బస్సుమి
ఇప్పు డేమవుతుందంటావు!" అంట
చెప్పడానికి ధైర్యం లేకపోయింది-అ
సంగతి ఏమంటోంది అమ్మ! అప్పు
తిండి పెడతా నన్నానని.

★

నిన్నరాత్రి వెన్నెట్లో బన్సుమిత్రుడు, "France" యుద్ధం మానింది. ఇప్పు డేమవుతుందంటావు!" అంటున్నాడు. నేను news paper చదవనని చెప్పడానికి ధైర్యం లేకపోయింది-అతను నన్నేదో గొప్ప చేశాడని. France సంగతి ఏమంటోంది అమ్మ! అప్పుడే బ- పశ్చాత్తాప పడుతున్నాడు, నాకు తిండి పెడతా నన్నానని.

నాన్న.

★ ★ ★